శ్రీమద్భగవద్గీత
(పంచమ ముద్రణము)
వ్యాఖ్యాత: శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
వెల్వెట్ రు. 4-0-0. పోస్టేజి రు. 0-9-0.
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.


# ఆంధ్రపత్రిక


తెలుగు మెఱుగులు
గ్రంథకర్త: శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
వెల రు. 2/- తపాలాఖర్చులు 0 7 0
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 226 SATURDAY 19th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# కమ్యూనిస్టు చైనా పరిగణన సమస్యపై కామన్వెల్తు

## ఆసియా సమస్యలపై చర్చకు కొలంబోలో కామన్వెల్తుసభ

### సమావేశప్రాధాన్యాన్ని వివరిస్తూ కామన్సు సభలో బెవిన్ ప్రకటన

లండన్, నవంబరు 17: బ్రిటిష్ విదేశాంగమంత్రి ఎర్నెస్టు బెవిన్ ఈవేళ కామన్సుసభలో విదేశ వ్యవహారములపై చర్చనుపక్రమిస్తూ, వచ్చే జనవరిలో కొలంబోలో అధినివేశరాజ్యాల విదేశాంగ మంత్రుల సమావేశం జరుగుతుందనీ, ఈ సమావేశమునకు తాను బ్రిటిష్ ప్రతినిధివర్గానికి నాయకుడుగా వెళ్లగలనని ఆశిస్తున్నాననీ ప్రకటించెను.

"మాకుమటుకు ప్రాచ్యపాశ్చాత్యాలనే విభేదాలు ఏమీ లేవు. అధినివేశరాజ్య కూటమిలో ప్రాచ్య పాశ్చాత్యరాజ్యాలు సుదిగూర్చి ఒకే ధారాన గుచ్చబడివున్నవి. వివిధ అధినివేశ రాజ్యాల మధ్య అనుస్యూతంగా వస్తున్న ఈ ఐక్యతను కలకాలం నిలబెట్టడానికి మనం శాయశక్తులా కృషిచేయాలి. అధినివేశరాజ్యాలు ఏ సమస్యవచ్చినా ఎప్పటికప్పుడు పరస్పరం సంప్రతింపులు జరుపుకుంటూ వుండడానికి వీలుగా, కావలసిన వ్యవస్థ ఏర్పాటు చేయడం అయినది. అరమరలేకుండా ఒకరికొకరు కావలసిన సమాచారం అంతా అందజేసుకుంటున్నాము. ఈనాడు ఆసియా ఖండ రాజ్యాలను పాశ్చాత్యదేశాలను అన్యోన్యం అనుబంధించి ఐక్యపరుస్తున్న మహత్తరశక్తులలో ఈ అధినివేశ రాజ్యకూటమే ప్రధానతమమైనదని చెప్పవచ్చును."

ఆర్థిక సమస్యలగూర్చి ప్రస్తావిస్తూ, డాలరు స్టెర్లింగు ప్రాంతాల మధ్య సమత్వం కుదరకపోవడం, ఆందోళనజనకంగా వున్నదనీ, ప్రపంచశాంతి సాధనకై రాజకీయంగా చేస్తున్న ప్రయత్నాలు ఈ ఆర్థికసమస్యల మూలంగా ఫలప్రదం కాకుండా పోతున్నవని, బెవిన్ చెప్పెను.

వాషింగ్టనులో బ్రిటన్ అమెరికా కెనడాలు ఇటీవల జరిపిన సంప్రతింపులు ఈ సమస్యాపరిష్కారానికే ఉద్దేశించబడినవనీ, ఆర్థికసమస్యలను రాజకీయ దృష్టితో కూడా పరిశీలించడం అవసరమన్న అభిప్రాయంతోనే తాను స్పెండర్ అబట్ లతో ఐరోపావిషయాలన్నిటిమీద ఇటీవల కూలంకషంగా చర్చలు జరిపితిననీ, బెవిన్ వెల్లడించెను.

అధినివేశ రాజ్యాల ఆర్థిక మంత్రుల సమావేశంగూర్చి ప్రస్తావిస్తూ, స్టెర్లింగు ప్రాంతానికి సంబంధించిన ప్రతి చిన్న పెద్దసమస్యను నిర్మొహమాటంగా, గోప్యం లేకుండా చర్చించవలసినదనీ ఆర్థికవిషమస్థితినుంచి బైట పడడానికి అందరూకలిసి సమిష్టిగా ఒక విధానాన్ని నిర్ణయించుకున్నామనీ, ఆయన చెప్పెను.

"కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశాన్ని కొలంబోలో జరపవలసిందని సింహళప్రభుత్వంచేసిన ప్రతిపాదనను మేము సంతోషపూర్వకంగా స్వీకరించాము. ఒక నూతన అధినివేశ రాజ్యరాజధానిలో ఈ సమావేశం జరగడం చాలా ముదావహం. ఈ సమావేశంలో ఆసియా సమస్యలు చర్చకు రాక తప్పదు కొబట్టి ఈ సమావేశానికి గల ప్రాధాన్యం ఎటువంటిదో సభ్యులు గుర్తించగలరని విశ్వసిస్తున్నాను."

"హేగ్ రౌండుటేబుల్ సమావేశం జయప్రదంగా పరిసమాప్తం అయినందుకు సంతోషాన్ని వెలిబుచ్చుతూ, బెవిన్ ఇట్లు అనెను. ఈ సమస్య చివరిచివరికి ప్రాగ్దక్షిణ ఆసియాకు యూరపుకు మధ్య పెద్ద సంఘర్షణగా పరిణమించే ప్రమాదం ఏర్పడింది. కాని హేగ్ రౌండుటేబుల్ సమావేశం జయప్రదమై డచ్చి సింహాసనంతో సంబంధం తెగకుండా ఇండోనీషియాకు సర్వ స్వాతంత్ర్యం ఇవ్వడానికిప్పుడు వీలైనందులకు నేను చాలా సంతోషిస్తున్నాను."

జర్మనీగురించి ప్రస్తావిస్తూ, అక్కడి పరిపాలనలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైందనీ, యంత్రాగారాలను కూలదీసివేయడం విషయంలో పూర్వవిధానాన్ని కొంత మార్చుకోవాలని నిర్ణయించామనీ చెప్పెను. జర్మనీలో యూదు ...

(2 వ పేజీ చూడుడు)

## సమాలోచనలు

### బ్రిటిష్ విదేశాంగశాఖకు హైకమిషనర్ల నివేదన

### భారతదేశంముందు గుర్తించేసూచన

లండన్, నవంబరు 17. చైనాలో పీకింగు పట్టణమును రాజధానీ నగరముగా ఏర్పరచుకొనియున్న కమ్యూనిస్టు ప్రభుత్వమును సక్రమమైన ప్రభుత్వముగా ఆమోదించు విషయమై ఇంగ్లండున్న, బ్రిటిష్ కామనువెల్తులోని యితర రాజ్యములును కలిసి సమాలోచన చేయుచున్నవి. నవంబరు 15 తేదీని లండనులోనున్న ఆయా కామనువెల్తు రాజ్యాల హైకమిషనర్లు యీ విషయమై తమ తమ ప్రభుత్వముల అభిప్రాయ సంకల్పములను బ్రిటిష్ విదేశరాజ్యాంగ కార్యాలయమువారికి నివేదించిరి. బ్రిటిష్ విదేశాంగ మంత్రియగు బెవినుగారు యీవిషయమై యింకను ఆలోచించవలసిన విషయములను తమ మిత్రరాజ్యాలతో సంప్రతించుచున్నామని చెప్పిరి.

ఈ విషయములో భారత ప్రభుత్వము యొక్క అభిప్రాయమును భారతప్రధాని పండిత జవహరిలాలు నెహ్రూగారు యిటీవల లండనుకు వచ్చినప్పుడు తెలియజేసిరి. అంతేగాక, నిన్న ఢిల్లీలో పత్రికా ప్రతినిధులతో మాట్లాడినప్పుడుకూడా యీ క్రిందిరీతిగా వెల్లడించిరి:

కమ్యూనిస్టుచైనా ప్రభుత్వమును గౌరవించి పరిగణించుటకు కాలహరణముచేయ వీలులేదు. ఇతరరాజ్యాలతోకూడా యీ విషయమై సంప్రతించడముగుచు. కాని అంతమాత్రము చేత ఏ యితర రాజ్యంతోను భారతదేశం ముడిపెట్టుకొని యుండదు. పై రీతిగా పండిత జవహరిలాలు నెహ్రూగారు వెల్లడించిన అభిప్రాయములనుబట్టి చూడగా బ్రిటను కంటెముందుగాను ఇతర కామనువెల్తు రాజ్యాల కంటె ముందుగాను భారతదేశమే కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమును ఆమోదించవచ్చును. బహుశః జనవరి మాసారంభములోనే అది జరుగవచ్చును. చైనాలో నాంకింగు నగరమందున్న ఇండియా ప్రభుత్వ రాయబారి నాంకింగునుండి ఢిల్లీకివచ్చి ఇండియా ప్రభుత్వముతో మాట్లాడుచున్నాడు. అతడు వివరించెడి విషయములను విన్నపిమ్మట ఇండియా ప్రభుత్వమొక నిర్ణయముచేయగలదు. కమ్యూనిస్టుచైనా ప్రభుత్వము రష్యాకు దాసోహం అనెడి బానిసప్రభుత్వము కాదని నెహ్రూగారివాదన. చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము ప్రస్తుతము మావోసేటూంగుగారి ఆధిపత్యమున స్వతంత్రరాజ్యంగానే యున్నది. ఈ ప్రభుత్వముయొక్క సిద్ధాంతములు కమ్యూనిస్టు సిద్ధాంతములేకావచ్చు కాని చైనాప్రజలు మొదటినుండియూ మరొకరాజ్యమునకు లొంగియుండినవారుకారు. వారికి స్వతంత్రవ్యక్తిత్వంకలదు. కనుక వారు

(2 వ పేజీచూడుడు)

### చుంకింగులోని అమెరికన్ కార్యాలయాల మూసివేత

వాషింగ్టను, నవంబరు 17: ప్రస్తుతం చైనా జాతీయ ప్రభుత్వ కేంద్రమైన చుంకింగుకు కమ్యూనిస్టు ప్రమాదం ఏర్పడడం చేత అక్కడగల అమెరికను కాన్సలేటునూ, రాయబార కేంద్రాన్నీ మూసివేయడం జరుగుతుందని నేడు అమెరికా ప్రభుత్వ శాఖ వారు ప్రకటించారు.

## బ్రిటిష్ప్రభుత్వ డాలర్ ఆర్జనలో పెరుగుదల

### ఖజానా మంత్రి క్రిప్సు ప్రకటన

లండన్, నవంబరు 17: "బ్రిటన్ తాలూకు బంగారం, డాలర్ నిల్వలలో సెప్టెంబరు మాసాంతం మొదలుకొని పెరుగుదల వున్నది. అది 2 కోట్ల పౌనుల పైచిలుకు." అని నేడు బ్రిటిష్ ఖజానామంత్రి సర్ క్రిప్స్ పత్రికా విలేఖరులసభలో వెల్లడి చేశారు.

ఈ పెరుగుదల ఇట్లాగే వుంటుందని చెప్పటం ఎవరికైనా కష్టమేనని కూడా ఆయన అన్నారు. అయినా అంతర్జాతీయ వ్యాపారంలో బ్రిటన్ తన్నుతాను సమస్థితిలో నిలుపుకోలేకపోతున్న పక్షంలో భవిష్యత్తును గూర్చి భయపడవలసిన అవసరం లేదని ఆయన అభయం ఇచ్చారు.

1950 జూన్ దాకా ఈ నిల్వల పెరుగుదలలు తిరుగుముఖంపట్టే తాయన్న భయం అవసరం. అదీ కాకుండా స్టెర్లింగు ఇప్పటి రేటుతో బాగానే పనిచేస్తున్నది. అది ముందుగూడా అట్లా పనిచేయదని అనుకోవలసిన అగత్యం నాకేమీ కనపడటంలేదు.

స్టెర్లింగు ప్రాంతం ఇప్పుడు పనిచేస్తున్నట్లుగానే ఇకముందుగూడా పనిచేయవలసి వున్నదని ఆయన ఈ సందర్భంలో స్పష్టంచేశారు, ఇది బ్రిటన్కు ఎంత అవసరమో, పశ్చిమ ఐరోపాదేశాలకు కూడా అంతే అవసరమని ఆయన చెప్పారు. అందువల్ల, స్టెర్లింగు ప్రాంతం ఇప్పుడు వ్యాపారాది విషయాలలో అనుభవిస్తున్న స్వతంత్రస్థితికి భంగంవాటిల్లే పనిని ఎవ్వరుగాని, చేయకూడదని ఆయన వాదించారు.

స్టెర్లింగు ప్రాంతంలో సభ్యులైన అప్పుడున్న స్వతంత్రతా వ్యాపారస్థితి, పశ్చిమ యూరపు అంతటాగూడా అల్లుకుపోగలదని, సర్వ ప్రపంచంకూడా దాన్ని ఆమోదించగలుగడం రావాలని ఆయన అన్నారు. పశ్చిమ ఐరోపా రాజ్యాలకు మధ్య ఇన్ని హిత సంబంధాలు ఏర్పడగల సావకాశాలు లేనంత ఇప్పుడు తీవ్రంగా ఆలోచిస్తున్నాము. ఇందుకు ఏ ఇతర రాజ్యం ఎటువంటి సూచనలుచేసినా ఆలోచించడానికిగూడా నేను సిద్ధంగా వున్నాను అని ఆయన అన్నారు.

అక్టోబరులో బ్రిటిష్ ఎగుమతి వ్యాపారం బాగా అభివృద్ధి అయింది. అయినా ఇదంతా పౌనువిలువ తగ్గించడంవల్లనే అభివృద్ధి అయిందని చెప్పడం సాధ్యం కాదు.

### దూరప్రాచ్య కమిషన్లో పాకిస్తాన్ బర్మాలకు సభ్యత్వం

వాషింగ్టను, నవంబరు 17: దూరప్రాచ్య కమిషనులో నేడు అధికారరీత్యా పాకిస్తాను, బర్మాలకు సభ్యత్వం ఇవ్వబడింది. ఇప్పుడు కమిషనులో 11 దేశాలకు సభ్యత్వం ఉన్నది.

ఇండియా విభజన కాగానే దూరప్రాచ్య కమిషను సభ్యత్వం ఇండియా డొమినియనుకు సంక్రమించింది. అందుచేత పాకిస్తాను సభ్యత్వంకొరకు వెంటనే దరఖాస్తు పెట్టుకొన్నది.

నేటి కమిషను సమావేశంలో పాకిస్తాను రాయబారి ఎం. ఏ. ఎచ్. ఇస్పహానీ, బర్మా రాయబారి ఊసోన్యూన్ పాల్గొన్నారు. వీరు కమిషనులోని తమ ప్రతినిధి వర్గాలకు నాయకులుగా ఉంటారు.

### ఉత్కళ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవం

#### డా॥ పట్టాభి ప్రసంగం

కటక్, నవంబరు 18: డిసెంబరు 23 వ తేదీన జరిగే ఉత్కళ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సమావేశములో రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు ఉపన్యసిస్తారు. (స్వ. వి.)

## టిబెట్కు కమ్యూనిస్టు ముప్పు

### సైన్య సమీకరణ

లండన్, నవంబరు 18: చైనా కమ్యూనిస్టులు టిబెట్టుమీద దండయాత్ర జరపడం తప్పదని కొంతమంది పరిశీలకులు భావిస్తున్నారు.

టిబెట్టు ప్రభుత్వం కమ్యూనిస్టులను ఎదుర్కొనేందుకు 20 వేల మంది మనుష్యులను సైన్యంలోకి రిక్రూటు చెయ్యాలని అనుకుంటున్నదని, దేశంలోవున్న కంచరగాడిదల లెక్కలను తయారు చేస్తున్నదని కాలింపాంగ్ నుంచి డెయిలీ మెయిల్ రిపోర్టరు వ్రాస్తున్నాడు.

ప్రస్తుతం టిబెట్టుకు 8 వేల సైన్యం వుంది. మిలిటరీ రిజర్వు 12 వేల దాకా వుంది. సైన్యానికి రైఫిళ్లు, 50 మిషన్ తుపాకులు, 25 శతఘ్నులు వున్నాయి.

చైనా కమ్యూనిస్టులు ప్రస్తుతం టిబెట్టు నైఋతి సరిహద్దుల పొడుగునా మసలుతున్నారు. తూర్పు సరిహద్దులోగూడా వారి సంచలనం వున్నట్లు తోస్తున్నది. అందుకు టిబెట్టు ప్రభుత్వం ఈ ప్రాంతాన్నంతా బలపరుస్తున్నది.

ఒకవేళ కమ్యూనిస్టులు టిబెట్టుమీదకు వస్తే అందుకు రెండే మార్గాలు వున్నాయని యీ విలేఖరి వ్రాస్తున్నాడు. (1) ఉత్తరంలో సికియాంగ్ గుండా (2) యేకుండో, డెర్గీలగుండా. ఇవి తూర్పు టిబెట్టులో వున్నాయి.

## టర్కీప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కుట్ర

### అధ్యక్షునిపై హత్యాప్రయత్నం

ప్రెసిడెంట్ ఇనూన్యూ

అంకారా, నవంబరు 17: టర్కీ ప్రభుత్వపు అధ్యక్షుడైన ఇనూన్యూగారిని చంపుటకును టర్కీ ప్రభుత్వమును కూలద్రోయుటకును కుట్రచేసిరను కారణమున టర్కీ పార్లమెంటులోని ప్రతికూల పక్ష సభ్యులను ఇద్దరిని అరెస్టుచేయుటకు నేడు టర్కీ ప్రభుత్వం ఉత్తర్వుచేసినది. ప్రెసిడెంటు ఇనూన్యూగారినిన్నీ డెమోక్రటిక్ పార్టీకిచెందిన ప్రభుత్వ ప్రతిపక్షనాయకుడగు జెలాలు బాయరుగారినిన్నీ చంపివేసి ప్రస్తుతపు టర్కీ ప్రభుత్వ ప్రతికూల పక్షములోని పట్టుదలగల ముగ్గురు సభ్యులు ప్రయత్నించిరని సదరు ప్రతికూల జాతీయపక్షమునకు చెందిన పార్లమెంటుసభ్యుడగు రిసత్ అయిటన్లీగారు టర్కీ ప్రభుత్వమునకు తెలియజెప్పిరని అధికారరీత్యా టర్కీ ప్రభుత్వం నేడొక ప్రకటన చేసింది. ఈకుట్రచేసిన సభ్యులు సాదిక్ ఆల్దోగాను, ఉస్మాన్ బోలుకబాసీ, ఫువాట్ అర్నా అను ముగ్గురు కలరని వారి పేర్లు తెలియజేసెను. అంకారా నగరంలోని జనరలు ప్రాసిక్యూటరు పెంటుకోర్టు ఈ విషయమై దరియాప్తు జరుగవలెననియు బ్యూలుకోబాసీ నిన్నీ, అర్నానున్నూ అరెస్టుచేయవలెననియు ఉత్తర్వు చేసెను. ఇదివరలో టర్కీ సైనిక శాఖాధిపతిగానుండిన మార్షలు చాక్ మాకుమకూడా అరెస్టు చేయుటకు వారంటు జారీ చేయబడెను. ఇతడిప్పుడు నేషనలు పార్టీకి గౌరవ నాయకుడుగా నున్నాడు. మార్షలు చాక్ మాక్ వయస్సు 77 సంవత్సరాలు. అతడు 1944 సంవత్సరంలో తన ఉద్యోగపదవినుండి విరమించెను. అప్పుడు టర్కీ అధ్యక్షుడగు ఇనూన్యూగారు అతనిని అభినందించుచు అతని సేవను ప్రశంసించుచు ఒక ఉత్తరము అతనికి వ్రాసెను. నేటి టర్కీ రాజ్యమును యీ ఉచ్ఛస్థితికి తీసికొని వచ్చినవారిలో కెమాలుపాషా గారును, ప్రెసిడెంటు ఇనూన్యూగారును యెంత ప్రాముఖ్యము వహించిరో మార్షల్ చాక్మాకు కూడా అంతటి ప్రాముఖ్యం వహించెను. వెనుకటి టర్కీ సుల్తానువద్ద చాక్మాకుగారు యుద్ధశాఖా మంత్రిగా పనిచేసిరి. కాని టర్కీకి మోక్షం కెమాలుపాషాగారి ద్వారానే కలుగవలెనని తలంచి కెమాలు పాషాకు రహస్యంగా సైన్యం తాలూకు ఆయుధాలను సప్లయిచేసెను. కెమాలు పాషాతో కలిసి టర్కీ సుల్తానుపై తిరుగుబాటును ఇతడు సాగించెను. అతనితో కూడా కలిసి కొంతకాలం యితర దేశాలకు పారిపోయి మారువేషంతో తిరిగెను.

## "తుపాన్ బాధితులకు దేశమంతా సహాయపడాలి"

### కాంగ్రెస్ కార్యవర్గ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, నవంబరు 18: ఆంధ్రదేశంలోని తుపాను బాధితులకు దేశంలో అందరూ సహాయం చేయవలెనని కాంగ్రెస్ కార్యవర్గం నేడొక విజ్ఞప్తి చేసినది.

అది ఈ విధంగా ఉన్నది. "అక్టోబర్ 27, 28 తేదీలలో ఆంధ్రదేశంలో తుపాను చేసిన ఘోరత్వాన్ని తెలుసుకుని కాంగ్రెస్ కార్యవర్గం ఎంతో బాధపడినది. గంటకు 85 మైళ్ళ వేగంతో ప్రచండంగా వీస్తున్న వాయువుకు తోడు ఉప్పెన కెరటం కూడా వచ్చి వందలకొలది మైళ్లుగా కోస్తాప్రాంతాన్నంతా ముంచెత్తివేసినది. ఈ కెరటం కొన్నిచోట్ల 20 అడుగులఎత్తు కూడా లేచి దేశంలోపలికి 6 మైళ్ళవరకూ చొచ్చుకుని వచ్చినది. వీటన్నిటికీ తోడుగా కుంభవర్షాలు కురిసినవి. ఒక్క రాత్రిలో 20 అంగుళాల వాన పడి కొండవాగులు పొర్లి పోయినవి. చెరువుకట్టలు, కాలవగట్లు తెగిపోయి ఎంతో దేశాన్ని నీటిలో ముంచివేసినవి.

ఈ మూడు విధాలైన కష్టాలూ కలిసి మామిడి, అరటి, నారింజ, కొబ్బరితోటలన్నిటినీ ధ్వంసంచేసినవి. ఉప్పెనతగిలిన ప్రాంతాలన్నిటిలోనూ వరిపైరు సర్వనాశనమై పోయినది. మిగిలినచోట్ల కూడా చాలావరకు నాశనమై పోయినది.

ప్రభుత్వం వేసిన అంచనాలను పట్టి తుపానువల్ల 780 మంది మరణించినట్లూ, 2,63,150 ఇళ్లు నాశనమైనట్లూ, 30,120 పశువులు కొట్టుకొనిపోయినట్లూ తెలుస్తున్నది. 4,68,000 ఎకరాలపంట పూర్తిగా నాశనమైనది. కొబ్బరితోటలు ఎన్నోవేల ఎకరాలు నాశనమైనవి. మిగిలిన చెట్లలోకూడా చాలాభాగం తుపానుగాలి మెలిపెట్టినందువల్ల నాలుగైదేళ్ళవరకూ కాపు కాసే స్థితిలో లేవు. ఇక అసలునష్టం ఇంకాఎక్కువగా నేఉంటుంది. ప్రయాణసాధనాలు దెబ్బతినటంవల్ల నష్టం ఎంతకలిగిందీ సరిగా తెలుసుకొనటం సాధ్యం కాలేదు. ఆస్తినష్టం, ప్రాణనష్టం విపరీతంగా ఉన్నది.

మద్రాసు ప్రభుత్వం సహాయ కార్యక్రమానికి పూనుకున్నప్పటికీ, అనధికార సహాయనిధివల్లనే తప్ప ఇతరత్రా బాధితులకు పూర్తిసహాయం చేయటం సాధ్యం కాదు. అనధికార విరాళాలన్నిటినీ స్వీకరించేనిమిత్తం మద్రాసు గవర్నర్ త్వరలో నే ఒకనిధిని నెలకొల్ప బోతున్నారు. దేశంలో ఉన్న వితరణ సంస్థలనూ, సాంఘిక సేవా సంస్థలనూ, ఉదారవ్యక్తులనూ, తాము ఆ నిధికి స్వయంగా విరాళాలను పంపి, సేకరించిన మొత్తాలను పంపి తోడ్పడాలని కార్యవర్గం విజ్ఞప్తి చేస్తున్నది. విరాళాలను మద్రాసు గవర్నర్ పేరగానీ అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి (జంతర్ మంతర్ రోడ్డు ఢిల్లీ)కి కాని పంపకోరుతున్నది.

## దూరప్రాచ్యంలో అమెరికా విధానం

### జనవరిలో ప్రాంతీయ ఉద్యోగుల సభ: ప్రముఖులతో ట్రూమన్ చర్చలు

వాషింగ్టన్, నవంబరు 17: దూర ప్రాచ్యదేశాల్లో ఉన్న అమెరికన్ ప్రతినిధివర్గాల ప్రధానోద్యోగులంతా జనవరి చివరలో సయాం రాజధాని బాంకాక్లో సమావేశమై దూర ప్రాచ్యపరిస్థితిపై చర్చ జరుపుతారని అమెరికా ప్రభుత్వం నేడు ప్రకటించినది. విదేశాంగ శాఖలోని ఉన్నతోద్యోగులు, చైనా వ్యవహారాల్లో నిపుణులైన రాజకీయవేత్తలూ నేడు ప్రెసిడెంట్ ట్రూమన్ను కలుసుకుని దూర ప్రాచ్య పరిస్థితిపై గంటసేపు చర్చించారు. విదేశాంగ మంత్రి ఎచిసన్, ఉప విదేశాంగ మంత్రి వెబ్ వివిధ దేశాల్లోనూ అవసరమైనప్పుడెల్లా సంచరించే సంచార రాయబారి డాక్టర్ జెసప్, చైనాలో అమెరికా రాయబారి స్టూఅర్టు, అమెరికన్ దూర ప్రాచ్యవ్యవహార శాఖా సహాయకార్యదర్శి బటర్వర్త్, విదేశాంగ శాఖకు చైనా విషయక సలహాదార్లుగా ఉన్న డా॥ ఎవరెట్ కేస్, డా॥ రేమాండ్ ఫాస్డికలు ఆ సంప్రదింపుల్లో పాల్గొన్నారు.

వీరిలో డా॥ జెసప్ ఇప్పుడు దూర ప్రాచ్యంలో అమెరికన్ విధానాన్ని గురించి పరిశీలన జరుపుతున్నారు. సమితిలో కూడా ఈయన ముఖ్య ప్రతినిధి కావటంవల్ల సమితిప్రస్తుత సమావేశం పూర్తి అయ్యే వరకూ ఉండి ఆ తరవాత బాంకాక్కి వెళతాడు.

"బాంకాక్కి వెళ్ళేటప్పుడు ఇండియా పాకిస్తాన్లనూ జెసప్ చూస్తాడు." అని అమెరికన్ ప్రభుత్వం ప్రకటించింది.

### తూ. పంజాబు సంస్థానాల ప్రభుత్వం

పాటియాలా, నవంబరు 18: పాటియాలా తూర్పుపంజాబు సంస్థానాల కూటమియొక్క ప్రభుత్వమును ఇండియా ప్రభుత్వసంస్థాన వ్యవహారశాఖ వారు లేను అధీనములోనికి తీసికొనుచున్నారని తెలియుచున్నది. రాజప్రముఖు ప్రభుత్వమునకు ఆధిపత్యం వహించును. ఈ సంస్థానాల కూటమియొక్క 7 గురు మంత్రులు నేడు రాజీనామా నిచ్చిరి. వారి రాజీనామాలనురాజ ప్రముఖు అంగీకరించెను.

## కమ్యూనిస్టులతో పోలీసుల సంఘర్షణ

### ఒక ఇన్స్పెక్టరుకు 3 కానిస్టబుల్కు గాయాలు

మధుర, నవంబరు 17: మధురకు ఆరు మైళ్లలో, కమ్యూనిస్టు పెచ్చుపెరిగిన ప్రాంతంగా పరిగణింపబడుతున్న పొడుంబాఅనే గ్రామంమీద పోలీసువారు దాడి చేశారు. తప్పించుకుతిరుగుతున్న కొందరు కమ్యూనిస్టులు ఆ గ్రామంలోవున్నారనే వార్తతెలిసి అక్కడికి వెళ్లారు. ఇద్దరు సబ్ఇన్స్పెక్టర్ల ఆధ్వర్యంలో వెళ్లిన ఈ దళం రెండుగాచీలి గ్రామాన్ని రెండు వైపులా చుట్టడించారు.

ఇందులో ఒకదళం ఒకసందులోనుంచి పోతుండగా కత్తులూ, లాఠీలూ తీసుకుని 15 మంది కమ్యూనిస్టులు వెనకపాటుగా వచ్చి వారిమీదపడ్డారు. ఇన్స్పెక్టర్కు వళ్లంతా తీవ్రమైన కత్తిపోట్లు తగిలినై. తక్కిన ముగ్గురు కానిస్టబుల్సుకూ నెత్తిమీద ప్రమాదకరమైన లాఠీదెబ్బలు తగిలినై. వారిలో ఒక కానిస్టబుల్ తప్పించుకుని దూరంగాపోయి రివాల్వరు కాల్చటంతో కమ్యూనిస్టులు పారిపోయారు.

దెబ్బలు తగిలిన ఈ పోలీసువారిని హాస్పిటల్లో చేర్చారు. ఈ దండయాత్ర చేసినవారిలో వున్నట్టు అనుమానించబడిన ఒక 6 గురిని అరెస్టుచేశారు. మరొక బలమైన రిజర్వు దళాన్ని వెంటపెట్టుకొని జిల్లా పోలీసు సూపరింటెంటు ఆప్రాంతంలోవున్న గ్రామాలన్నీ ఈ దుండగీంద్రకోసం వెదుకుతున్నారు.

### పాకిస్తాను రాజ్యాంగ పరిషత్తు

కరాచీ, నవంబర్ 18: పాకిస్తాను రాజ్యాంగ పరిషత్తు డిసెంబరు 22 తే సమావేశమగునని నేడు ప్రకటింపబడెను.

## గంటల పంచాంగం

విరోధి సం॥ కార్తీక బ॥ చతుర్దశి
1949 సం॥ నవం॥ 19 శనివారం
శ॥ చతుర్దశి ప 4-29 స్వా ప 1-52 వర్జ్యం సా 6-50 ల 8-15 కు.
బ॥ అమా॥ నవం॥ 20 ఆదివారం
ఆ॥ అమావాస్య ప 1-3 విశా ప 11-10 వర్జ్యం ప 2-44 ల 4-10 కు.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ కార్తీక బ॥ చతుర్దశి
శనివారం

## బాధితుల అవసరములు

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సావకాశము కలిపించినందుకు కాంగ్రెసు అధ్యక్షులు పట్టాభి సీతారామయ్యగారు పండిత నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్ గార్లకు కృతజ్ఞతావందనము లర్పించిరి. కాంగ్రెసు కార్యవర్గము ఆంధ్రరాష్ట్రమును తక్షణము నిర్మించుటకు భారతప్రభుత్వము చర్యలు తీసికొనవలెనని సిఫారసు చేసిన దినమునసే భారత ప్రధాని ఆంధ్రదేశ తుపాను బాధితుల సహాయార్థమయి, విరాళము నిచ్చెను. ఇందుకుకూడ ఆంధ్రప్రజ భారతప్రధాని యెడ కృతజ్ఞతాభావమును చూపెదరు.

ఆంధ్రదేశమునకు మొన్న తుపానువల్ల కలిగిన నష్ట ప్రమాణము ఇంతవరకు ఆంధ్రదేశము కనివిని యెరుగదు. అందువల్లనే రాష్ట్రము రానున్నదను సంతోషమును తగినంతగ వెలిబుచ్చలేక పోయిరి. భారతదేశములో ఏప్రాంతమునందు ప్రమాద మేర్పడినను, ఆంధ్రులు తమచేతనైన సహాయము చేయుచు నచ్చిరి. ఇపుడు తమకు కలిగిన అవాంతరము యావద్భారత దృష్టిని పొందలేక పోయినందుకు కొంత కినుక, విచారములుగ కపోలేదు. బాధితులకు విరాళములనిచ్చి సహాయపడవలసినదని భారతప్రధాని విజ్ఞప్తిచేయుటతో, యావద్భారతదృష్టి నాకర్షించి, దేశముత్తము మీద సహాయనిధులు ఆరంభింపబడగలవని ఆశించవచ్చును.

మొన్న రాష్ట్ర శాసనసభలో తుపాను ప్రాంతములందు ప్రభుత్వము చేయవలసినదానిని గురించి సభ్యులు వివిధ సూచనలు చేసిరి. వాటిలో కొన్ని తాత్కాలికము, కొన్ని దీర్ఘకాలికములు, మరి కొన్ని తక్షణము చేయవలసినవి. ప్రభుత్వముగాని, ప్రజాసంస్థలుగాని తక్షణము చేయవలసిన వాటిపైననే ముందు తమ శక్తిని వినియోగించవలసి యున్నది. అనేకప్రాంతములందు ప్రజలకు కట్టుగుడ్డ, ఆహారధాన్యము లేకుండ పోయినవి. అక్కడ ముందు ఈ పదార్థములు సరఫరా అగునట్లు చూడవలెను. తుపానువల్ల కలిగిన నష్టము రు. 50/- కోట్లుండునని కాంగ్రెసు అధ్యక్షులు అంచనా వేసిరి. వారి అంచనాలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదని, కూలిపోయిన ఇండ్లను, చనిపోయిన పశువులను గమనించిన బోధపడగలదు. ఇక పంటనుగురించి చెప్పవలసినది లేదు. వెంటనే బాధితుల కష్టనివారణకు రు. 2కోట్లు కావలెనని సూచించిరి. రాష్ట్రప్రభుత్వము అవసరములను గమనించి ఎప్పటికే ఎంత పైకము అవసరమని తోచిన అంత వెచ్చించుటకు వెనుకాడరని రెవెన్యూ మంత్రి హామీ నిచ్చెను. రెమిషనులు ఇచ్చు విషయమునకూడ ఉదారముగ వ్యవహరించుదునని కూడ హామీ నిచ్చెను. బాధితులకు కావలసినది కేవలము పైకము కాదు. వారికి కావలసినది వస్తువులు. కాబట్టి వట్టి పైక మిచ్చుట కన్న వస్తురూపేణ బాధితులకు సహాయ మిచ్చుటే అవసరము. విరాళములు వసూలుచేసెడి స్థానిక ప్రముఖులు ఈ అంశమును గమనించుట అవసరము. ఇది తక్షణ ఉపశమనమునకు చేయవలసిన కార్యములు. ఇదికాక దీనితో పాటు పడిపోయిన యిండ్లను కట్టుకొనుటకు, చెడిపోయిన చెరువులను బాగుచేయుటకు సహాయపడవలసి యున్నది. చెరువులను, కాలువలను తక్షణము బాగుచేసినగాని, మరల వ్యవసాయముచేయుట అనునది సాధ్యముకాదు. ఈ కార్యము కేవలము సామాన్యపద్ధతిని సాగించిన పుణ్యకాలము గడచిపోవును. అది అసాధారణపద్ధతిని సాగించవలెను. అందువల్ల ఆపనిని మిలిటరీకి అప్పగించుట యుక్తముగనుండవచ్చును. అంతేకాక సహాయ వస్తుపంపక పనినికూడ వారికప్పగించవచ్చును.

తుపాను బాధిత ప్రాంతములో ముందు ఎదుర్కొనవలసినది ఆహార సమస్య. ఇది తక్షణ సమస్యయేగాక తరువాత ఎదుర్కొనవలసిన సమస్య కూడ. తుపానువలన దెబ్బతినిన జిల్లాలు ఒకటి రెండు తప్ప మిగిలినవన్నియు మిగులు జిల్లాలు. ఇతరజిల్లాలు కూడ వీటిమీద ఆధారపడి యున్నవి. ఇపుడు ఆ జిల్లాలందే కాటకము ఏర్పడుస్థితి వచ్చినది. అందువల్ల ఆజిల్లాలందు చెడిపోయిన భూములను వెంటనే సాగుచేయుటకు తగిన వసతులను కలిగించవలసియున్నది. కాలువలను, చెరువులను బాగు చేయించుటతో బాటు, తక్కువ ధరలో, పశువులు, విత్తనములు దొరకునట్లు చూడవలెను.

దెబ్బతిన్న జిల్లాలందు కేవలము పునర్నిర్మాణ కార్యక్రమమే సాగవలసియున్నది. దీనికి ప్రభుత్వ సహాయముతో బాటు రాష్ట్రములో నున్న వివిధ సంస్థలకు చెందిన సేవాదళములు కూడ పూనుకొనవలెను. కాంగ్రెసు సేవాదళములున్నవి. స్వయంసేవక సంఘము లున్నవి. స్కౌటు సంస్థ లున్నవి. నారందరూ కలిసి పునర్నిర్మాణ కార్యక్రమములో ప్రజలకు తోడ్పడుట అవసరము. తమ సేవా తత్పరతనుచూపుటకు ఇంతకన్న వారికి సదవకాశము లేదు.

## అభినవభారత మనువు డాక్టర్ అంబేద్కర్

న్యూఢిల్లీ, నవంబర్ 17: హిందూ ధర్మశాస్త్ర సవరణ బిల్లులాంటి దాన్ని ప్రతిపాదించిన డాక్టర్ అంబేద్కర్‌ను అభినవభారత మనువు అని ఎలా పొగడుతున్నారని అస్సాం ప్రతినిధి రోహిణీ కుమార చౌదరి యీ రోజు రాజ్యాంగపరిషత్ సమావేశంలో ప్రశ్నించారు.

రాజ్యాంగ ముసాయిదాను తయారు చేయటంలో అత్యంత సేవచేసినందుకు అంబేద్కర్‌గారిని పొగడుతూ ప్రసంగిం చకున్న సేఠ్ గోవిందదాస్‌గారు ఇలా సమాధాన మిచ్చారు.

"హిందూ ధర్మశాస్త్ర సవరణబిల్లున్ని నాయిముకు నేను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాను. అయినా అంబేద్కర్ చాలా ప్రతిభా ప్రభావాలు గలవారని అందుచేత అభినవభారత మనువు అని పొగడవలసి వస్తుంది.

సహాయనిధికై నాటకం

బెజవాడ నగరంలోని ఆర్. వి. సైన్సు కాలేజీ వారు ఆంధ్ర తుపాను సహాయనిధికై నవం 18, 19 తేదీలలో మున్సిపల్ హాలులో 'మనోహర' నాటకము ప్రదర్శింతురు.

## గండికోట - కృష్ణా పెన్నారు ప్రాజెక్టులు

### కౌన్సిలులో భక్తవత్సలం గారి సమాధానము

చెన్నపట్నం, నవంబరు 18: గండికోట రిజర్వాయరు పరిశోధన ముగిసినదనియు, కృష్ణా పెన్నారు ప్రాజెక్టుతో సంబంధము లేకుండ స్వతంత్రముగా దీనిని నిర్మించుట ప్రభుత్వమువారి ప్రస్తుతో గ్రేశ్యమనియు, ఈ ప్రాజెక్టుకు రూ. 5 కోట్లు ఇప్పటి రేట్ల ప్రకారం అగునని అంచెనా వేయబడెననియు మద్రాసు పబ్లిక్‌వర్క్సు మంత్రి భక్తవత్సలంగారు నేడు కౌన్సిలులో ఆర్. సూర్యనారాయణ రావుగారి ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి. స్వతంత్ర ప్రాజెక్టుగా లక్ష ఎకరాలలోపు సాగులోకి వచ్చుననియు, అందు పదివేల ఎకరాలు పల్లమనియు కృష్ణా పెన్నారుతో జతచేసిన 1.5 లక్షల ఎకరాలు పల్లపుభూమి అగుననియు మంత్రిగారు తెలిపిరి.

కృష్ణా పెన్నారు ప్రాజెక్టు ఖర్చు అంచెనా రు. నూరుకోట్లు అగుననియు, 30 లక్షల ఎకరాలు సాగులోకి రాగలవనియు అందు గండికోటలోని 1.5 లక్షల ఎకరాలు కలసి వచ్చిననియు మంత్రిగారు తెలిపిరి. గండికోట - కృష్ణా పెన్నారు కలపి సాగించు వ్యవహారము పరిశీలింపవలెననియు రెంటినీ జతచేసిన గండికోట ప్రాంతమునకు మేలునదనిరి. రెంటినీ కలుపవలెననియు, అందుకు వీలుగా గండికోట ప్రాజెక్టుప్లను మార్పు విషయము అంచనాలు పూర్తి అయిన తర్వాత త్వరలోనే ఆలోచింపబడుననియు మంత్రిగారు తెలిపిరి.

డెటిన్యూల నిర్బంధము సందర్భమున మానికొండ సూర్యపతిగారి వకాల్తాపై హైకోర్టు వారిచ్చిన తీర్పును ప్రభుత్వము వారు పరిశీలించినారనియు ఆలస్యములేకుండా వ్యవహారము జరుగవలెనని ప్రభుత్వం వారు ఉత్తర్వు చేసినారనియు లాశాఖామంత్రి మాధవ మీనన్‌గారు ఆర్. సూర్యనారాయణరావుగారికి సమాధానముగా తెలిపిరి.

### ఇంజనీరింగ్ కళాశాల

కులమువల్ల ఇంజనీరింగ్ కాలేజీసీట్లకు ఇబ్బందులు పడుతున్నట్లు పత్రికలు వ్రాసిన సంగతి ప్రభుత్వము గమనించలేదనియు, ప్రతిభకు ఇన్ని స్థానములని ప్రత్యేకించలేదనియు కుల, భాషా, జిల్లా పద్ధతికి భంగములేకుండా స్థానములు మిగిలినచో అవి ప్రతిభా సమన్వితులైనవారికి ఇవ్వబడుననియు, భీమారావుగారి ప్రశ్నకు సమాధానముగా మద్రాసు ప్రభుత్వ ఆహారమంత్రి భక్తవత్సలంగారు తెలిపిరి.

డా॥ జాన్: కళాశాలల ప్రవేశము వరకు ఈ కులతత్వపద్ధతిని ప్రభుత్వము వారు రద్దుచేయరాదా?

స: కాలేజీలలోని స్థానములు కుల, భాషా, ప్రాంతీయముగా అమర్చబడినవి. అన్ని కులములకు న్యాయము జరుగుటకు అట్లు చేయబడినందున అది మార్చుటకు వీలులేదు.

ప్ర: దరఖాస్తుచేసిన వారందరికీ ప్రవేశమిచ్చుటకు యత్నించెదరా?

స: అది సాధ్యముగానిపని. నాల్గు కళాశాలలు ఉన్నవి. అవి సౌమ్యమైన పద్ధతులలో ఏర్పడవలసియున్నవి.

ప్ర: ఎప్పటికైనా అది సాధ్యము చేయ ప్రభుత్వమునకు ఏమైనా కార్యక్రమం ఉన్నదా?

స: ఇప్పుడు ఉన్న వాటికే సౌమ్యము చేయుటకే కొంతకాలము పట్టును. క్రొత్త కళాశాలలు వచ్చినగాని అదనంగా విద్యార్థుల చేర్చుకొన వీలుండదు.

ప్ర: క్రొత్త కళాశాలలు పెట్టనున్నారా?

స: ఇప్పుడేమీ అందుకు ప్రణాళికలులేవు.

ప్ర: పోనీ ప్రారంభించే విషయము ఆలోచించెదరా?

స: ఆలోచింతుము. ఇప్పుడు ఉన్న వాటికే భవనములు, ఇతర్యాది సౌకర్యములు ఏర్పరచవలసి ఉన్నది.

బంట్రోతులకు జనక సన్నెంకు రూపాయలు అష్టి గరిష్టం 38 వరకు పెంచబడెనని, దానికితోడు అధికధరల అలవెన్సు ఇచ్చుచున్నామనీ, వారి కుటుంబాల ఆర్థిక సర్వేచేయు ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదనియు, ఆర్థికమంత్రి ఒక ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

## విశాఖ నాయకుల రాయబారం

విశాఖజిల్లా శాసన సభ్యులు కాంగ్రెసు సంఘాల కార్యదర్శులు అధ్యక్షులు నిన్న పట్టిలకు వచ్చిన శాఖ మంత్రులను సందర్శించి, ఆజిల్లాకు కలిగిన అపార నష్ట వివరములనుగూర్చి తెలిపి సుమారు రూ 5 లక్షలయినా సహాయం చేయాలని కోరిరి, ప్రభుత్వంవారు తీసుకున్న జమాను ప్రాంతాలకు గూడ నష్టపరిహారము యిప్పించాలని, న్యాయసేకరణ నిలుపు చేయాలని కోరిరి, మంత్రులు శాంతంగా వినిఅన్ని విషయాలు ఆలోచిస్తున్నామనిరి.

## ఇండియా ఆర్థికాభివృద్ధి అవకాశం

### అమెరికన్ సెనెటర్ల అభిప్రాయం

న్యూఢిల్లీ, నవంబరు 17: "మేము చూచిన దేశాలలోని ఆర్థిక రాజకీయ పరిస్థితులను గూర్చి కాంగ్రెసుకు నివేదించడమే మా పర్యటనయొక్క ఆంతర్యం," అని ప్రస్తుతం ఇండియాలో పర్యటిస్తున్న అమెరికన్ సెనెటర్లు పత్రికా విలేఖరులకు తెలియజేశారు.

పత్రికా విలేఖరులతో వీరిగోష్ఠి ప్రభుత్వ భవనంలో జరిగింది. అమెరికన్ కాంగ్రెస్ పక్షాన వలుగురు సెనెటర్ లు భారతదేశం ముఖ్యమైన దేశాలను చూడడానికి బయలుదేరారు. ఇందులో ఇద్దరు డెమాక్రాట్లు, ఇద్దరు రిపబ్లికన్లు. వీరికి ఎలెన్ జె. ఎలెండర్ నాయకత్వం వహిస్తున్నారు.

సెనటర్ ఎలెన్ జె. ఎలెన్‌డర్ తమ పర్యటన యొక్క ఉద్దేశాన్ని వివరిస్తూ పత్రికావిలేఖరులకు ఈలా చెప్పారు.

ఇందులో ఒకదేశం ఆర్థిక పోషణను గూర్చి విచారించడం మాపని కాదు. పూరికే అచ్చటచ్చట ప్రవర్తిల్లు దేశకాలమాన పరిస్థితులను పరిశీలించడం, ఆ వివరాలను కాంగ్రెస్‌కు నివేదించడం, ఇదే మా పని.

సెనటర్ ఎలెన్‌డార్ ఇండియాను గూర్చి ప్రత్యేకంగా మాట్లాడారు. ఆయన మూడు సంవత్సరాల క్రితం ఒకసారి ఇండియాకు వచ్చిపోయారు.

ఇండియా అభివృద్ధికి మంచి సావకాశాలు వున్నాయి. ఈ దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యలు రెండు ఒకటి. ఆహారం; రెండు జనాభా. కాని దేశంలో కావలసినంత నేల వున్నందువల్ల ఆహార సమస్యను తేలిగ్గా తేల్చుకోవచ్చుననే నా అభిప్రాయం. దాంతో జనాభా సమస్య కూడా తీరిపోతుంది. ఇందుకు, మీరు ఈ నేలను ఎట్లా సాగులోకి తీసుకురావలసినదీ ముందు తెలియాలి. ఆ తరువాత కష్టపడి పనిచేయాలి.

మీరు ఏన్నో ప్రాజెక్టులు నిర్మిద్దామనుకుంటున్నారు. అందువల్ల వదుల ముంపులు ఆగడమే గాకుండా, విద్యుచ్ఛక్తి గూడా ఉత్పన్నమౌతుంది. అవి అన్నీ పూర్తి అయిన నాడు మీదేశం బాగుపడి, ప్రజలు భాగ్యోపేతులౌతారు.

ఈ సందర్భంలో భారత ప్రభుత్వం తమకు గావలసిన సమాచారాన్ని ఇచ్చి, వేసిన ప్రశ్నలకు సావధానంగా ప్రత్యుత్తరాలు చెప్పినందుకు ఆయన వారికి కృతజ్ఞతను తెలియజేశారు.

## దక్షిణాఫ్రికా భారతీయుల సమస్య

### పరిష్కారవాంఛ

లండన్, నవంబరు 18: దక్షిణ ఆఫ్రికా భారతీయుల సమస్య విషయంలో భారత ప్రధానితో సమాధానం కుదుర్చుకోవాలని మెలోరియా ప్రభుత్వం బాగా తహతహలాడుతున్నది.

సమితి సూచించిన ప్రకారం జరగనున్న రౌండ్ టేబిల్ సమావేశానికి వంపే ఆహ్వానాన్ని ఇండియా అంగీకరిస్తుందనే మేము భావిస్తున్నాము. ముప్పాతిక ముప్పాళ్లు ఈ సమావేశం కేటౌన్‌లో జరుగుతుంది. అట్లా అయిన పక్షంలో అక్కడి భారతీయులతో సంప్రదించుకొనే గల సావకాశం ఇండియాకు లభిస్తుంది. ఢిల్లీ పట్టుపడితే ఈ సమావేశం ఇండియాలోనే జరగవచ్చు, అని దక్షిణ ఆఫ్రికాయన్ కౌలాను అధికారి ఒక ఆయన చెప్పారు.

ఈ సమస్య జటిలమైంది కాబట్టి సమావేశం దీర్ఘకాలం జరుగవచ్చునని, కాని సమావేశం పూర్తి అయ్యేలోపలనే ఇండియా హైకమిషనర్ దక్షిణ ఆఫ్రికా వచ్చేటట్లు చూస్తామనికూడా ఆయన చెప్పారు.

సింగపూర్, నవంబరు 16: ఈ సమావేశంలో పాల్గొంటున్న సభ్య దేశాలతో సాధ్యమైనంతవరకు భారతదేశం సహకరించగలదని ఆగ్నేయ ఆసియా యూనియన్ ఈ క్యులు సమావేశంలో పాల్గొన్న భారత ప్రతినిధి శ్రీ కె. పి. ఎస్. మీనన్నారు.

ఇండియా ఈ సమావేశంలో పాల్గొంటున్న దేశాలకు గోనెసంచులు, జౌళ్లు, బొగ్గు సరఫరా చేస్తుందని, 1951 అనంతరం సాధ్యమైతే ఆహార ధాన్యాలు కూడా ఇవ్వగలదని అన్నారు.

ఈ సమావేశాలు 1946లో ప్రారంభమైన ఆగ్నేయ ఆసియాలో బ్రిటిష్ హైకమిషనర్‌గావున్న లార్డ్ కిల్లారన్ వీటినేర్పాటు చేశారు. ఇంతకు పూర్వం ఇటువంటి సమావేశాలు 28 జరిగాయి. ఇది 29 వది. దీనితో ఇవి ఆఖరు.

## హైద్రాబాదు రాజ్యాంగ పరిషత్తు చేసే నిర్ణయాలను అమలుజరిపే అధికారం భారతప్రభుత్వానిదే

హైద్రాబాద్, నవంబరు 17: హైద్రాబాద్ సంస్థాన రాజ్యాంగపరిషత్తు సమావేశమైనప్పుడు, హైద్రాబాద్‌ను తాత్కాలికంగా భారతసమాఖ్యలో చేర్చుటకు అనుమతించే నిజాంనవాబు ప్రకటనను, రాష్ట్రముల నమూనా రాజ్యాంగమును ఆమోదిస్తూ నిజాం త్వరలో చేయనున్న ప్రకటనను, ధృవపర్చటమే దాని కార్యక్రమంలో మొదటిఅంశం కాగలదని తెలుస్తున్నది. ఇది జరిగినతర్వాత హైద్రాబాద్ రాజ్యాంగపరిషత్తును స్వతంత్రప్రతిపత్తిపోయి, భారతసమాఖ్యలో చేరిన ఒక సంస్థాన రాజ్యాంగ పరిషత్తు స్థాయికి వస్తుంది.

సంస్థానమును భాషా భాగాలుగా విభజించే విషయాన్ని గురించిగాని, నిజాం నవాబు భరిష్యత్తును గురించిగాని, అది చేయు నిర్ణయాలు భారతప్రభుత్వమునకు సిఫార్సులుమాత్రమే కాగలవని తెలుస్తున్నది. వాటిని అంగీకరించటంగాని, నిరాకరించటంగాని, అంగీకరించిన పక్షంలో అమలుజరపటంగాని చేసే అధికారం భారతప్రభుత్వానికే ఉండగలదు.

## సంప్రదింపులు భగ్నంకాలేదు

### స్వామిరామానందతీర్థ ప్రకటన

హైద్రాబాద్, నవంబరు 17: సంస్థానకాంగ్రెసు విభేదాల పరిష్కారంకొరకు జరుగుతున్న ప్రయత్నాలు భగ్నంకాలేదనీ, యింకా కొనసాగుతున్నాయనీ హైద్రాబాద్ కాంగ్రెసు అధ్యక్షులు స్వామిరామానంద తీర్థ గారు నేడు పి. టి. ఐ. విలేఖరితో ప్రసంగిస్తూ అన్నారు.

సంస్థాన కాంగ్రెసులోని ఉభయ పక్షాలమధ్య సమాధానాన్ని సాధించే ప్రయత్నంలో స్వామి రామానందతీర్థ బూర్గుల రామకృష్ణరావుగారలు యిప్పటికి రెండుపర్యాయములు కలుసుకొన్నారు.

హైద్రాబాద్ కర్నాటక రాష్ట్ర కాంగ్రెసుసంఘంలో స్వామీజీపక్షానికి చెందిన సభ్యులు ఛితాపూర్‌లో సమావేశమై సంఘ అధ్యక్షుడైన జనార్దనరావు దేశాయ్‌గారిపై విశ్వాసరాహిత్య తీర్మానంచేసి, ఆతనిస్థానంలో ఒకక్రొత్త అధ్యక్షుడిని ఎన్నుకొన్నారని నిన్నవార్త వచ్చింది. బూర్గుల రామకృష్ణారావుగారు నిన్న ఛితాపూర్ సమావేశాన్నిగురించి మాట్లాడుతూ, త్వరలో సంభవించనున్న వివాదాన్ని యిది తెలియజేస్తున్నదనీ, దీనివల్ల కాంగ్రెస్‌లోని ఉభయపక్షాల మధ్య సమాధానం కుదిరే అవకాశం చాల స్వల్పంగా ఉన్నదనీ అన్నారు.

ఉభయపక్షాలమధ్య సమాధానం సాధించటానికి జరుగుతున్న ప్రయత్నాలు భగ్నమై పోయినవనటను స్వామీజీ నిరాకరించారు. ఈవిషయంలో తాను త్వరలో రామకృష్ణరావుగారిని కలుసుకోవాలని ఆశిస్తున్నాననికూడ స్వామీజీ అన్నారు. ఛితాపూర్ సమావేశ సంఘటనవల్ల, సంస్థాన కేంద్రంలోగాని, మండలాలలోగాని తాలూకాలలోగాని పోటీ కాంగ్రెస సంఘాలు ఏర్పడవని స్వామీజీ సన్నిహిత వర్గాలవారు భావిస్తున్నారు. ఛితాపూర్ సంఘటన చేదువాటుగా జరిగినటువంటి దనిన్నీ, దీనిని జాగ్రత్తగా పరిష్కరించుకొనవలసిన అవసరం ఉన్నదనిన్నీ వీరు అభిప్రాయపడుతున్నారు.

## మేజర్ జనరల్ చౌధురీ విమానం

### మదనపల్లి వద్ద నిర్బంధావరోహణం

మదనపల్లి, నవంబర్ 1

హైదరాబాద్ మిలిటరి గవర్నర్ మేజర్ జనరల్ జె. ఎన్. చౌధరి గారు నిన్న సాయంత్రం బెంగుళూర్ నుండి హైదరాబాదుకు విమానములో వెళ్లుచుండగా, వాతావరణం సరిగా లేనందువలన మదనపల్లి మిలిటరీ ఆస్పత్రి మైదానమునందు బలవంతముగా విమానమును దింపవలసి వచ్చినది. పిమ్మట చౌధరిగారు మోటారు బస్సులో తాము దిగిన స్థలము నుండి నాల్గు మైళ్ల దూరంలో నున్న ఆరోగ్యవరం (క్షయరోగ ఆస్పత్రి) చేరుకొనిరి. అచ్చట నుండి ఆస్పత్రి అధికారుల మోటారుకారులో నిన్న సాయంత్రమే బెంగుళూరు వెళ్లిరి. వారి విమానము పరివారము సురక్షితమేనని తెలిసినది.

స్వ. వి.

## కమ్యూనిస్టు చైనా పరిగణన సమస్య

(1-వ పేజీ తరువాయి)

పరరాజ్యపు ఒత్తిడికి లొంగిలొబడినారు కారు.

బ్రిటిష్ విదేశాంగమంత్రి దూరప్రాచ్య రాజ్యములలోని బ్రిటిష్ ప్రతినిధులతో ఈ విషయమై సంప్రతించెను. కాని, కమ్యూనిస్టుచైనా ప్రభుత్వమును ఎంతత్వరగా పరిగణింపసాధ్యమగునో చెప్పజాలకున్నాడు. భారతప్రభుత్వము మాత్రము కమ్యూనిస్టుచైనాను ఎంతత్వరగా ఆమోదిస్తే అంతమంచిదని వాదించుచున్నది.

పాకిస్తాను ప్రభుత్వమున్ను, బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రభుత్వమున్ను యితర రాజ్యాలు త్రొక్కినమార్గమునే అనుసరించగలవు. వాటికి ప్రత్యేకాభిప్రాయములు ఈ విషయములో లేవు.

హాంకాంగులోని బ్రిటిష్ వారిహక్కులను కమ్యూనిస్టు చైనాప్రభుత్వము గౌరవించే షరతుమీదను యిందుకు తగిన గ్యారంటీలు యిచ్చేయెడలను కమ్యూనిస్టు చైనాను బ్రిటను గౌరవించవచ్చునని ఆస్ట్రేలియా వాదించుచున్నది. కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమును గౌరవించకూడదని న్యూజీలాండు ప్రభుత్వము తన అభిప్రాయమును తెలియజేసెను.

హాంకాంగులో బ్రిటిషువారికి గల హక్కు స్వాతంత్ర్యములు అంతర్జాతీయ న్యాయ సూత్రములనుబట్టి విదితమైనవే గనుక, కమ్యూనిస్టు చైనాప్రభుత్వము ప్రత్యేక గ్యారంటీలను తమకు యివ్వనక్కరలేదని బ్రిటిష్ ప్రభుత్వాభిప్రాయముగా నున్నది. మావో సేటుంగు ప్రభుత్వమును గౌరవించుటకు ఫ్రాన్సు సంసిద్ధతను చూపుచున్నది.

బ్రిటను యీ కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమును గౌరవించుట భావ్యమనియు సవ్యమనియు చర్చిలు తన అభిప్రాయమును వెల్లడించెను. చైనాలోని బ్రిటిష్ హక్కులను సదరు కమ్యూనిస్టు రష్యాలో మన రాయబారిని ఉంచుటకు అంగీకరించిన మనము కమ్యూనిస్టు చైనా ప్రభుత్వంతో రాయబార సంబంధమును కలిగియుండుటకు ఎట్టి ఆక్షేపణలు ఉండనక్కరలేదనిరి.

పెకింగు నగరములో నున్న అమెరికను కౌన్సిలు జనరలు అను ఆంగసువార్డుగారు కమ్యూనిస్టుచైనా అధికారులచే నిర్బంధములో ఉంచబడియున్నారు. అందువల్ల అమెరికను విదేశాంగ కార్యదర్శియగు డీన్‌అచిసనుగారు కమ్యూనిస్టు చైనాను గౌరవించుటకు విముఖత్వమును చూపిరి.

అయితే పెద్దచిక్కు ఒకటి ఉన్నది. ఐక్యరాజ్యసమితి తాలూకు భద్రతామండలియందు చైనాప్రభుత్వమునకు స్థిరమైన సభ్యత్వస్థాన మొకటికలదు. స్థిరసభ్యత్వంగల అయిదు అగ్రరాజ్యాలలో అది ఒకటి. భద్రతామండలి చేసిన ఏ తీర్మానమునైనను త్రోసివేయుటకు యీ ఐదు అగ్రరాజ్యాలకు వ్యతీకరణ వోటుకలదు. ప్రస్తుతం భద్రతామండలియందు భారతదేశమునకు సభ్యత్వం కలదు. కమ్యూనిస్టు చైనాను భారతదేశం ముందుగా గౌరవించినయెడల, భద్రతామండలిలోని ప్రస్తుత చైనాప్రభుత్వ ప్రతినిధిని భద్రతామండలి సభ్యత్వంగల భారతదేశం నిరాకరించినట్లగును, అప్పుడు భద్రతామండలిలోని మిగిలిన సభ్యరాజ్యాలు యిప్పుడున్న చైనా ప్రతినిధిని గౌరవించునాయను సమస్య బయలుదేరును. రాగల భద్రతామండలి సమావేశములో యీ సమస్య బయలు దేరును. కనుక, అన్నిరాజ్యాలు ఏకకాలమందే కమ్యూనిస్టు చైనాను గౌరవించుట సంభవింపగలదు.

## ఉత్కళ పత్రికా విలేఖరుల వార్షిక సమావేశం

పూరీ, నవంబర్ 17: డిసెంబరు మొదటి వారంలో పూరీకి రానున్న ఇండియా గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి ఉత్కళ పత్రికా విలేఖరుల సంఘం వారి ఆయిదవ వార్షిక సమావేశాన్ని ప్రారంభిస్తారని తెలుస్తున్నది.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించమని యునైటెడ్ ప్రెస్ మేనేజింగ్ డైరెక్టరు, ఎడిటరూ అయిన బి. సేన్ గుప్తాను విలేఖరుల సంఘం వారు కోరి ఉన్నారు.

## చుంకింగుకు 95 మైళ్లలో కమ్యూనిస్టు సేన

హాంకాంగు నవంబరు 18: చైనా జాతీయ ప్రభుత్వపక్షమునకు ప్రస్తుతపు రాజధాని నగరముగానున్న చుంకింగు పట్టణమునకు 95 మైళ్ల దూరములో కమ్యూనిస్టుసేనలు చేరు చేరియున్న వని హాంకాంగుకు చేరినసమ్మకమైన వార్తలవల్ల తెలియుచున్నది.

## అమెరికాలో పర్షియా చక్రవర్తి

వాషింగటను, నవంబరు 16: పర్షియా చక్రవర్తియను షా అమెరికాకు విచ్చేసెను. అమెరికా ప్రెసిడెంటగు ట్రూమనుగారున్ను అమెరికను ప్రభుత్వ కార్యదర్శులును విమానాశ్రయమువద్ద షా చక్రవర్తిని కలిసికొనిరి, సైనికలాంఛనముగా అమెరికను సైనిక నౌకా వైమానిక దళములు జోహారు చేసెను. షా చక్రవర్తి గౌరవార్థముగా అనేక విందులు సన్మాన సమావేశములు ఏర్పాటు చేయబడినవి. న్యూయార్కులోను ఇతర పట్టణములలోను వారి గౌరవ సమావేశములు ముగిసిన పిమ్మట షా చక్రవర్తి అమెరికా పశ్చిమోత్తరప్రాంత పట్టణములకు పోవును. ప్రెసిడెంటు ట్రూమనుగారి మోటారులో నే మకాముకు వెళ్లెను, గొప్ప గొప్ప అతిథులు బసచేయుటకై అమెరికా ప్రభుత్వము ఏర్పాటుచేసిన "బ్లెయిర్ హవుసు"లో రేపు షా చక్రవర్తి బస చేయును.

వాషింగటను నగరములో షా చక్రవర్తికి అనేక వ్యవహార కార్యకలాపములు కలవు.

అమెరికా చేయదలచుకొన్న సైనిక ఆయుధ సహాయ ప్రణాళిక ననుసరించి పర్షియాకు కావలసిన సైనిక ఆయుధబలముల గురించి పర్షియను చక్రవర్తి ఇచటి అమెరికను సైనిక శాఖాధికారులతో చర్చించును.

ఆదివారమునాడు న్యూయార్కు కు ప్రయాణమై పోవును. మరుసటివారమంతయును, అమెరికాలోని పశ్చిమ ప్రాంత పట్టణములకును పసిఫిక్కు తీర పట్టణములకును విమానం మీద పర్యటనముచేయును. కొలంబియా జిల్లాకమీషనర్లు వాషింగటను నగరములో ఆయనకు స్వాగతమొసంగి నగర పౌర స్వాతంత్ర్యమును ఆయనకుయిచ్చిరి. ఈ సన్మానమైన పిమ్మటనే, ట్రూమనుగారి తాత్కాలికమకాము అగు బ్లెయిరుహవుసుకు పర్షియను చక్రవర్తి వెళ్ళెను.

నేటిరాత్రి ప్రెసిడెంటు ట్రూమను లవముకామునందు షా చక్రవర్తికి విందొసంగెను. ఈ విందుసందర్భములో ఉపన్యసించుచూ పర్షియా చక్రవర్తి యిట్లు చెప్పెను.

పర్షియాకు అమెరికా చేయుచున్న వస్తుసామగ్రుల సప్లయిలకున్ను, శాస్త్ర నిపుణులను సప్లయిచేయుట తోడ్పడుచున్నందుకున్ను, ప్రపంచశాంతి కల్పనకు పర్షియాకూడా తోడ్పడి పాశ్చాత్యవిజ్ఞానమును శిరసావహింపగలదు. ట్రూమనుగారు పర్షియాకు విచ్చేయవలెనని ఆహ్వానించుచున్నాను. వారు మానవ స్వాతంత్ర్యముకొరకును లోక శాంతికొరకును చేయుచున్న కృషి వల్లవారియెడల మాకుగల గౌరవము అత్యధికమైనది. పర్షియా దేశము యొక్క అత్యంత క్లిష్టదశలో నేను ఆ దేశముయొక్క ప్రభుత్వ బాధ్యతలను వహింపవలసివచ్చెను. దేశ మధ్యంలోని ఆర్థికసాంఘిక చిక్కులను చక్కదిద్దవలసి వచ్చెను. ఆదే సమయంలో యితరదేశాలతో శాంతంగా భద్రంగా వ్యవహరించవలసివచ్చెను. పర్షియా రాజ్యము దురాక్రమణ సంకల్పములు లేనిది ఇరుగుపొరుగు రాజ్యాలతో ఆర్థిక సామరస్యమును విజ్ఞాన సంస్కార సాహచర్యమును పర్షియా సదా కోరుచు ఐక్యరాజ్యసమితి ధర్మ సూత్రములకు బద్ధమై వ్యవహరించును.

## ఇండోనీషియాకు డాలరు సహాయం

బటేవియా, నవంబరు 17: ఇండోనీషియాకు సహాయం చేస్తామని నిన్న వాషింగ్టన్‌లో ప్రకటించబడిన 375 లక్షల డాలర్లుకాక మరి 25 లక్షల డాలర్లు కూడా ఇవ్వబడగలవని నేడిక్కడ వచ్చినవార్తలు వెలువడినవి. ఈ సహాయం ఇండోనీషియాలో నూతన ప్రభుత్వం ఏర్పడేవరకు వినియోగంకాదట.

1950లో ఇండోనీషియా విదేశాలనుండి కొనవలసిన దిగుమతుల విలువ 150 కోట్ల గిల్డర్లు వుంటుంది. (ప్రస్తుతం సుమారు 4 గిల్డర్లు ఒక డాలరు). ఇతర ప్రభుత్వాలకివ్వవలసిన బాకీలు అనేకకోట్ల గిల్డర్లుంటుంది. ఇండోనీషియాలో రాబడి ఖర్చుల వ్యత్యాసంలో ఒకభాగంమాత్రమే అమెరికా ఇచ్చే సహాయంవల్ల పూడగలదు.

అమెరికా ఇచ్చే సహాయం ఈక్రింది విధంగా వినియోగపడుతుంది: బియ్యం కింద కోటి డాలర్లు; వస్త్రాలకింద 225 లక్షల డాలర్లు; నూలుకింద 50 లక్షల డాలర్లు.

## ట్రైపు పరీక్షల మార్పు

ఆంధ్రదేశంలో తుపానువలన అక్టోబరు 28 తేదీ పరీక్షలకు హాజరుకాజాలని అభ్యర్థులకు టైపురయిటింగు ఇంగ్లీషు లోయరు పరీక్ష రాజమండ్రి, మచిలీపట్నం, విజయవాడ, గుంటూరులందు డిశంబరు 8 వ తేదీన జరుగునని కార్యదర్శి ప్రకటించనున్నారు.

హాలీబారంజ్

హాలీబట్ లివర్ ఆయిల్ను పుష్కలంగా కలిగిన ఉత్తమ మార్గము

గట్టి పదు పదునటను కలిగి పెరిగేటట్టు నమ్మకముగా పనిచేస్తుంది.

అలెన్ & హాన్బరీస్

బయు బిల్డింగ్స్, కలకత్తా. మరియు ధర్మనూర్ బిల్డింగ్స్, సర్ ఫిరోజ్షా మెహతా రోడ్, బొంబె.

జర్మన్ కెమేరా

12 ఫోటోలు తీసే ఫిలిం ప్రతి కెమేరాతో ఉచితంగా యివ్వబడును. PARKER WATCH Co., 166, Harrison Road, Calcutta.

"ప్రభాత్" లాంతర్లు, వత్తులు అడగండి

ప్రభాత్ ప్రాడక్ట్సు కంపెనీ, నోబుల్ ఛేంబర్సు, ఫోర్టు, బొంబాయి.

CATARACT

Try Dagoo's "EYE-CURE" (Regd) guaranteed. Specific for CATARACT and all other eye-troubles. No risk. Thousands cured without operation. Safe sure world wide reputed and tested' Success guaranteed. Particulars free Price Rs. 3. Postage As. 12 Please Correspond in English. KAMALA WORKS (A. P.) Panchpota, Bengal.

ఇదే నన్ను కాపాడినది

లివర్ క్యూర్

బమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు


# అమెరికాలో ఆయుధ నిర్మాణం

## రాజకీయ సంఘంలో రష్యాప్రతినిధి విమర్శ

లేక్ సక్సెస్, నవంబర్ 17: "బ్రహ్మాండమైన ఎత్తులో ఆయుధ నిర్మాణాన్ని తాను ఉరుకుపెత్తింపటమేకాక దానిని ఆర్థికంగా భరించలేని చిన్న యూరపియన్ సహచరులను కూడా అమెరికా ఒత్తిడిపెట్టి అనుసరింపజేస్తున్నది." అని ఈ వేళ ఆడవపు రాజకీయ సంఘ సమావేశంలో సోవియట్ ప్రతినిధి యాకబ్ మాలిక్ విమర్శించాడు.

ఆడవపు రాజకీయసంఘం ఈ వేళ ఆయుధ నిర్మాణపోటీ సమస్యను పరిశీలిస్తున్నది.

అమెరికా, తన చెప్పుచేతల్లో నడుస్తున్న ఆంగ్లో అమెరికన్ ముఠాతో కలిసి యుద్ధోన్మాదాన్ని కలిగించినది. ఐక్యరాజ్యసమితిలోని 59 దేశాల్లోనూ 32 దేశాలు అమెరికా సృష్టించి నడుపుతున్న సైనిక ఒడంబడికలలో ఉన్నవి. దురాక్రమణకొరకై చేసుకోబడ్డ ఉత్తర అట్లాంటిక్ సైనిక ఒడంబడికలో 12 దేశాలు, పాన్, అమెరికన్ (అఖిల అమెరికన్) సమాజంలో 20 దేశాలు ఉన్నవి. ఈ రెండు ముఠాలకూ పెన్నెముకగా ఉన్న అమెరికా ఈ రెండింటికీ లంకె కలుపుతున్నది.

ఆంగ్లో - అమెరికన్ ముఠా అన్ని దేశాలూ ఆయుధాలు తగ్గించుకోనేట్లు చేయటానికి సమితిలో చేయబడ్డ ప్రయత్నాలనూ, అటంబాంబులను నిషేధించటానికి జరిగిన ప్రయత్నాలనూ భగ్నం చేసింది.

సక్రమమైన, ఆయుధాల విషయమై సమితి ఏర్పరచిన ప్రత్యేక సంఘపు సిఫార్సులలో అన్ని దేశాల్లోనూ ఒకే తరహ ఆయుధాలు తగ్గించాలన్న నియమమూ, అటం ఆయుధాలను నిషేధించాలన్న నియమమూ లేనందువల్ల అవి ఆమోదించలిగినవి కావు." అని మాలిక్ ప్రసంగించాడు.

## లిబియా, సోమాలీలాండు ఎరిట్రియాలకింద సమితిఖర్చు

లేక్ సక్సెస్, నవంబరు 17: ఐక్యరాజ్య సమితి బడ్జెటు కమిటీవారు, పూర్వపు ఇటలీవలసలైన లిబియా, సోమాలీలాండు, ఎరిట్రియాల స్వాతంత్ర్య పథకం నిర్ణయించడానికిగాను నెలకొల్పబడిన సంఘాలకు గాను 4,52,000 డాలర్ల ఖర్చు మంజూరు చేశారు.

ఈ ఖర్చును ఐక్యరాజ్య సమితి భరించరాదనీ, లిబియా, సోమాలీలాండుల సలహా సంఘంలోనూ, ఎరిట్రియా కమిషనులోనూ సభ్యులుగాచేరి పనిచేయడానికి ముందుకు వచ్చినవారే వాటిఖర్చు భరించాలనీ. ఈ ప్రాంతాలపై ఆదేశాలకు పలుకుబడి ఉన్నదని తన అభిప్రాయమని రష్యా ప్రతినిధి అన్నాడు.

పోలెండు యుక్రేనులు రష్యాను బలపరచినవి. లిబియా మొదలైన కాలనీల విషయమై ఐక్యరాజ్య సమితిలో సంఘాలు స్థాపన కావడానికికూడా మొదటి రాజకీయ సమితిలో అభ్యంతరం చెప్పిన దేశాలివే.

పాకిస్తాను ప్రతినిధి ఈ దేశాలను విమర్శించుచూ మీరు మొదట కమిటీలో తమ ఆశయాలను సాధించుకోలేక బడ్జెటు కమిటీలో సాధించుచున్నారనీ, ఈ కాలనీల సమస్యలు పరిష్కరించడానికి పదునులు కట్టినవారికి అష్టం వస్తున్నారనీ, ఈ ప్రత్యేక కమిటీలకయే ఖర్చు ఐక్యరాజ్య సమితి భరించుకోవాలనీ అన్నాడు.

తీర్మానానికి 24 నరు అనుకూలంగానూ 5 నరు ప్రతికూలంగానూ వోటుచేశారు.

# కాశ్మీర్ సమస్య

## సమితి చర్చ 1950 లో జరిగే సూచన

లండన్, నవంబర్ 18: కొత్త సంవత్సరం వచ్చేదాకా కాశ్మీర్ సమస్యనుగూర్చి భద్రతామండలి చర్చించకపోవచ్చునని సమితి తౌలూకు విషయజ్ఞులు అంటున్నారు.

డిశెంబర్లో భద్రతాసంఘం ఈవిషయమై చర్చిస్తుందని ఇంతకు పూర్వం వచ్చిన వార్తలు చెబుతున్నాయి.

ఇటువంటి మార్పు జరిగిందని గాని, జరుగుతుందని గాని ఇక్కడ ఎవ్వరు ఏమీ చెప్పటంలేదు. కాని పండిట్ జవాహర్లాల్ నెహ్రూ అమెరికాలోను, బ్రిటనులోను ఈవిషయమై మంతనాలు జరిపారు కాబట్టి, తాను జరిపిన పర్యటనలో సమస్యను పరిష్కరించుకొని ఇండియాలోని తన సహచరులతో సంప్రదించాలని ఆయన ఉంటుందన్న అభిప్రాయాన్ని వెల్లడించారు. అందువల్ల ఈ మార్పు జరుగుతున్నదని మరి కొందరు అంటున్నారు.

# 'కాంగ్రెస్‌లో చేరేవారు కాంగ్రెస్ సేవాదళంలోనే సభ్యులైవుండాలి'

## స్వయంసేవకుల సభ్యత్వసమస్య: కాంగ్రెస్ కార్యవర్గ స్పష్టీకరణ

న్యూఢిల్లీ, నవంబరు 17: రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సభ్యులకు కాంగ్రెసులో ప్రవేశం ఇవ్వడం విషయమై లోగడఇచ్చిన రూలింగును స్పష్టీకరిస్తూ కాంగ్రెసు కార్యవర్గం ఈ వేళ ఒక ప్రకటన చేసింది. కాంగ్రెసు సభ్యులైనవారు ఎవ్వరు కాంగ్రెసు సేవాదళంలో తప్ప ఇంకో స్వచ్ఛందసేవక సంస్థలో దేనిలోను పాల్గొనకూడదని చెబుతూ కాంగ్రెసు క్రమశిక్షణ సూత్రావళిలో ఒక నిబంధన ఉన్నదని, ఆర్. ఎస్. ఎస్. వారిని యీ నిబంధన నుండి మినహాయించినట్లుగా లోగడ యిచ్చిన రూలింగుకు అర్థం చెప్పరాదనీ, కాంగ్రెసు కార్యవర్గం ఆప్రకటనలో వివరించింది.

కార్యవర్గంచేసిన ప్రకటన పాఠం ఇది: రాష్ట్రీయ స్వయంసేవక సభ్యులు భారత జాతీయ కాంగ్రెసులో ప్రాథమిక సభ్యులుగా చేరకూడదని అంటే ఏమైనా ఉన్నదా?అని బీహారు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కాంగ్రెసు కార్యవర్గాన్ని కొంతకాలం కిందట పృచ్ఛ చేసింది. ఈ ప్రశ్నకు సమాధానమిస్తూ, కాంగ్రెసు కార్యవర్గం నియమావళిలో ప్రాథమిక సభ్యులకు సంబంధించిఉన్న సూత్రాలను యథాతథంగా ఉదాహరించిందేతప్ప అంతకుమించి ఏమీ చేయలేదు. 21 సంవత్సరములుగాని అంతకు మించిగాని వయస్సుకున్న ఏ వ్యక్తిఅయినా, నియమావళిలోని 1 వ సూత్రాన్ని, ఆమోదిస్తున్నట్లు వ్రాతమూలకంగా ప్రకటించినట్లయితే అతనిని కాంగ్రెసు ప్రాథమిక సభ్యుడుగా చేర్చుకోవచ్చును అని 4 వ సూత్రం చెబుతున్నది. కాంగ్రెసు కార్యవర్గం బీహారు రాష్ట్ర కాంగ్రెసు కమిటీకిపంపిన ప్రత్యుత్తరంలో ఈ సూత్రాన్నిమాత్రమే ఉదాహరించింది కాని ఆర్. ఎస్. ఎస్. సభ్యులను కాంగ్రెసులోకి ఆహ్వానించి చేర్చుకోవాలని దీని అర్థంకాదు. కాంగ్రెసు ప్రాథమిక సభ్యులైన వారందరు కాంగ్రెసు క్రమశిక్షణ సూత్రాలకు లోబడి ఉండాలని వేరుగా చెప్పడం అనవసరం. కాంగ్రెసు క్రమశిక్షణ సూత్రావళిలో ఈ క్రింద చెప్పిన నిబంధన ఒకటి పొందుపరుపబడి ఉన్నది:

"కాంగ్రెసు సభ్యులైనవారు ఎవ్వరూ కాంగ్రెసు సేవాదళంతప్ప ఇతరతరమైన స్వచ్ఛంద సేవక సంస్థలో దేనిలోను పాల్గొనకూడదు."

మంత్రిగాగాని పార్లమెంటరీ కార్యదర్శిగా గాని పని చేయుచున్న వారిని ఎవ్వరినీ కాంగ్రెసు కమిటీలలో కార్యనిర్వాహక పదవులకు (ఆఫీసు బేరర్ల పదవులకు) ఎన్నుకోకూడదని కార్యవర్గం తీర్మానించింది. అంటే, అట్టివారిని అధ్యక్షులను కార్యదర్శి పదవులకు మాత్రమే ఎన్నుకోకూడదనీ, కార్యవర్గ సభ్యులుగా వారిని నియమించవచ్చుననీ, వర్కింగు కమిటీ వివరించింది.

వ్యవసాయ సంస్కరణల సంఘం నివేదికను ప్రచురించి ప్రజాభిప్రాయం తెలుసుకొని ఆ తర్వాత దానిమీద ఒక అంతిమ నిర్ణయం చేయాలని కార్యవర్గం నిశ్చయించింది. నివేదిక ప్రతులను వివిధ రాష్ట్ర ప్రభుత్వములకు ఇదివరకే అభిప్రాయార్థం పంపడమైనది.

ఆంధ్రదేశంలో ఇటీవల తుపానుబారికి గురియై నష్టపడిన ప్రజానీకానికి సహాయపడవలసిందిగా దేశప్రజలను కోరుతూ ఒక విజ్ఞప్తి పత్రాన్ని రచించవలసిందని కార్యవర్గం డా॥ రాజేంద్రప్రసాద్‌ను ఆదేశించింది. ఈ విజ్ఞప్తి రేపు ప్రకటనార్థం విడుదల చేయబడుతుందని తెలుస్తున్నది.

మద్రాసుగవర్నరు పేరిట ఒక నిధి ప్రారంభించబడుననీ, ఈ నిధికి దేశప్రజలందరు ఉదారంగా విరాళాలు ఇవ్వవలసిందనీ, ఆ విజ్ఞప్తిలో కోరడం అవుతుందనికూడా తెలుస్తున్నది.

# జావాలో 80 మంది హత్య

బటేవియా, నవంబరు 17:—ఇండొనీషియా పూర్తిగా ముస్లిము రాజ్యంగా ఉండాలనికోరే దారుల్ ఇస్లాం ముఠావేషదలు జావాలోని వాయవ్య తీరపట్టణమైన చెరిబాన్‌కు 10 మైళ్ళలో గల గ్రామంలో పురుషులను, స్త్రీలను, బిడ్డలను 80 మందిని చిత్రవధ చేశారని ఇక్కడికి సైనిక వార్తలు వచ్చినవి. నవంబరు 14 రాత్రి ఈ దురంతం జరిగినదట. సైనిక సహాయం వారు ఈ గ్రామం వద్దకు వచ్చేసరికి గ్రామం మధ్యమై శవాలు ఇలా చెదురుగా కనిపించినవట. ఇక్కడ నస్తి తిరిగివచ్చినట్లు కను, ఇచ్చి సైనికులకంటే ఈ గ్రామం వారు రక్షణ కోరి ఉండటం చేత ఈ దురంతం జరిగినదట.

# లజపతిరాయ్ వర్ధంతి

## రాజెన్‌బాబు ప్రభృతుల ప్రశంసలు

న్యూఢిల్లీ, నవంబరు 17: లాలా లజపతిరాయ్ వర్ధంతి సందర్భంలో ఇక్కడ జరిగిన ఒక బహిరంగ సమావేశంలో రాజ్యాంగశాసనపరిషదధ్యక్షుడు డా॥రాజేంద్రప్రసాద్ ఈ విధంగా ఉపన్యసించెను:

దేశ శ్రేయస్సుకోసం తన సర్వస్వము ధారపోసిన లాలా లజపతి రాయ్‌వంటి నిష్కామసేవకులు ఇప్పుడు దేశానికి చాలా మంది అవసరం. స్వాతంత్ర్య సముపార్జన చాలా క్లిష్టకార్యమే, కాని చేజిక్కిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవడం అంతకన్న కష్టమైనపని. కాని తమ వ్యక్తిగతమైన లక్ష్యములను ఆశయములను వదలుకొని దేశ శ్రేయస్సుకోసం అందరూ కలిసికట్టుగా పనిచేసినట్లయితే ఈకార్యం చాలా సులభం అవుతుంది.

లాలా లజపతిరాయ్ సూత్రాలను దైనందిన జీవితంలో అనుష్ఠించడమే, ఆయనకు శ్రద్ధాంజలి అర్పించడానికి ఉత్తమమైన పద్ధతి. లజపతిరాయ్ చాలా విశిష్టుడైన మహనీయవ్యక్తి. ఈనాటి నాయకులందరూ రాజకీయాలలో ఓనమాలుఅంటే కూడా ఏమిటోఎరుగని చిన్నవారుగా ఉండగా లజపతిరాయ్ దేశస్వాతంత్ర్యంకోసం తన సర్వస్వము ధారాదత్తం చేసి అహోరాత్రాలు పనిచేసెను. ఆయన శ్రమ అంతా నేటికి ఫలించింది; కాని దురదృష్టవశాత్తు స్వతంత్ర భారతదేశాన్ని కళ్లారా చూసే భాగ్యం ఆయనకు లేకపోయింది."

పండిట్ నెహ్రూ సమావేశానికి ఈ క్రింది విధంగా సందేశం పంపెను:

"ఈ మహనీయ భారతీయుని వర్ధంతి సందర్భంలో, ఆయన జీవిత సందేశాన్ని మనం మననం చేసుకొందుముగాక. స్వాతంత్ర్యం రాజకీయంగానేగాక సామాజికంగాను ఆర్థికంగానుకూడా ఫలప్రదం కావాలని సంకల్పించిన వారిలో లజపతిరాయ్ అగ్రగణ్యుడు. వెనకబడిన జాతులను ఉద్ధరించవలెననీ, స్త్రీలు ప్రతిపత్తిని ఉన్నతం చేయాలనీకూడా ఆయన తాపత్రయపడెను. మన కిప్పుడు రాజకీయ స్వాతంత్ర్యం హస్తగతమైంది కాబట్టి ఈ సాధనంతో లజపతిరాయ్ ఆకాంక్షించిన ఆర్థిక సమానత్వం ఇత్యాది యితర ఆశయములను కూడా మనం నెరవేర్తుముగాక!

దేశబంధు గుప్త, రాధారమణ్, టాండన్ ప్రభృతులు సమావేశంలో ఉపన్యసించిరి.

# ఫ్రెంచి ఇండియాలో జనవాక్య నిర్ధారణ

## భారత ప్రభుత్వ వైఖరి

కరెయికాలు, నవంబర్ 17: భారతదేశమునందలి ఫ్రెంచి భూభాగములలో జనవాక్య నిర్ధారణ స్వేచ్ఛగాను, న్యాయముగాను జరుగనియెడల భారత ప్రభుత్వమువారు దానితో నెట్టి సంబంధమూ పెట్టుకొనరని ఎ.క్షి. సి. సి. విదేశాంగ కార్యదర్శి డాక్టర్. వి. రాజకుమార్ గారు నేడిచ్చట ఉపన్యసించుచు ప్రకటించిరి. మనము ప్రతిఘటించడమునకు సమ్మతించుటయే గొప్ప పొరపాటు. సమ్మతించినమీదట దానికి మనము కట్టుబడి యుండవలసియున్నది. ఇండియా ప్రభుత్వము వారు ఈ విషయమై నిద్రపోవుట లేదు? అని డా॥ రాజకుమార్ గారు చెప్పిరి. కష్టముల నియమములనుగూర్చి కాంగ్రెస్ పైదేశికశాఖ కార్యదర్శి ప్రస్తావించుచు 1949 సం॥ ఏప్రిల్ అనంతరముగూడ సుంకముల ఒడంబడికను అమలు చేయుదాం అని ఇండియా ప్రభుత్వమువారు ఇచ్చియుండిరి. ముఖ్య వస్తువుల రవాణాపై విధింపబడిన నియమములవల్ల ఫ్రెంచి ఇండియా ప్రజలు నష్టకష్టములకు లోనుగాకుండా చేయుటయే భారతప్రభుత్వ సూచన ఉద్దేశ్యమని రాజకుమార్ గారు చెప్పుచు ఈ సూచనను ఫ్రెంచిఇండియా ప్రభుత్వము నిరాకరించిరని,ప్రత్యేక ఒడంబడిక కావలెనని కోరిరని, ఇట్టి ప్రత్యేక ఒడంబడికను భారత ప్రభుత్వము అంగీకరింప జాలకపోయెనని చెప్పిరి. భారతదేశమునందలి ఫ్రెంచి భూభాగములను విదేశీయ భూభాగములుగా భారతప్రభుత్వము వారు తలచలేదని రాజకుమార్ గారు చెప్పిరు.

ఫ్రెంచి భూభాగములయందలి వాస్తవిక పరిస్థితులను తెలిసికొని నివ్వెరు పర్యటించుచున్న శ్రీ రాజకుమార్ గారు నిన్న పుదుచ్చేరినుండి యిచ్చటికి వచ్చిరి. స్థానిక ప్రముఖులను ఆయన చూచుచున్నాడు. కరెయికాలు మేయర్ శ్రీ పకీర్‌సామి పిళ్ళైను ఆయన యిదివరకే చూచియున్నాడు. రేపు ఆయన యిచ్చటనుండి మాహే వెళ్ళును.

# ఉత్పత్తిసాధనాలు జాతీయం కాక తప్పదు

## గాడ్గిల్ ఉద్ఘాటన

న్యూఢిల్లీ, నవంబర్ 18: "ఉత్పత్తి సాధనాలు జాతీయం కాక తప్పదు. అయితే కొంతమంది అధికారంలో ఉంటే అది క్రమంగా జరుగుతుంది. మరి కొందరు అధికారంలో ఉంటే త్వరలో జరుగుతుంది. ఉత్పత్తి సాధనాలను ప్రభుత్వ యాజమాన్యం కిందికి, నిర్వహణ కిందికి తీసుకుని వచ్చే వ్యవస్థనే నూతన రాజ్యాంగం ప్రతిపాదిస్తున్నది." అని భారత ప్రభుత్వ నిర్మాణశాఖా మంత్రి గాడ్గిల్ నేడు రాజ్యాంగ పరిషత్తులో మాట్లాడుతూ ఉద్ఘాటించాడు.

# ఇస్లామిస్తాన్ స్థాపనకు ఈజిప్టులో ప్రాతికూల్యం

## ప్రధాని నెహ్రూ అభిప్రాయాన్ని బలపరుస్తూ సిద్కీపాషా ప్రకటన

కెయిరో, నవంబరు 17: ఇస్లామిస్తాన్ పథకాన్నిగూర్చి, సంయుక్త అరబ్బీరక్షణనుగూర్చి పండిట్ నెహ్రూ వెల్లడించిన భావాలతో తాను ఏకీభవిస్తున్నట్లు నేను ఇస్మాయిల్ సిద్కీపాషా,అల్ మిస్రీ అనే పత్రికకు ఒక ఉత్తరం వ్రాశాడు.

ఇస్మాయిల్ సిద్కీపాషా ఈజిప్టులో ప్రముఖరాజకీయవేత్త.

పండిట్ నెహ్రూ ఇంగ్లండునుండి, ఇండియా తిరిగివస్తూ కెయిరోలో పత్రికా విలేఖరులు వేసిన ప్రశ్నలకు సమాధాన మిస్తూ ఈ రెండు విషయాలపట్ల తన అభిప్రాయాన్ని ఏమిటో విస్పష్టం చేశారు.

(1) ఏ చిన్న చిన్న రాజ్యాలు అల్పమైన మూలాలుగా ఏర్పడితే ప్రపంచ శాంతికి కల్గేహాని ఏమీలేదు సరికదా, వాటి శ్రేయస్సుకే అవి తోడ్పడజాలవు.

(2) మతం ప్రాతిపదికగా 'స్థాన' లు ఏర్పాటుం సాధవచ్చును. సంస్కృతికి సంబంధించిన సంబంధాలు వుంటే వుండవచ్చునుగాని, మతంమీద రాజకీయాలు అల్లితే జరిగేమేలు ఏమీలేదు.

ఇస్మాయిల్ సిద్కీపాషా తానీరెండు అభిప్రాయాలతోను పూర్తిగా ఏకీభవిస్తున్నట్లు ఈ ఉత్తరంలో స్పష్టంచేశాడు.

సంయుక్త అరబ్బీరక్షణ విధానం అటంబాంబుకన్నా వినాశకారి కాగలదని చెప్పినవాడు ఇస్మాయిల్ పాషానే. అటు ఒడంబడిక అరబ్బీరాజ్యాలు చేసుకుంటే అది ఏదవాళ్ళంతాకలిసి తమధనాన్నంతా వచ్చించే మరువీద ఒక ధనవంతునితో సంధిచేసుకున్నట్లు వుంటుందని ఆయన అన్నాడు.

# కామన్వెల్తు సభ: బెవిన్ ప్రకటన

(1 వ పేజీ తరువాయి)

పరిశ్రమలను రద్దుచేయడం అవసరం అనీ, పాశ్చాత్యరాజ్యాలయొక్క జర్మన్ ప్రజలకు నైతికస్థైర్యం కలగకుండా చూడడం అవసరమే అయినప్పటికీ, ఈ కార్యక్రమాన్ని పూర్తిగా చాలించడం యుక్తంకాదనీ, ముఖ్యంగా ఉక్కు పరిశ్రమ విషయంలో ఈ కార్యక్రమాన్ని విరమించడం తనకు ఏ మాత్రమూ సబబుగా కనిపించలేదనీ, బెవిన్ అనెను.

ప్రతిపక్ష నాయకుడు విన్‌స్టన్ చర్చిల్ ఉపన్యసిస్తూ, జర్మనీలో యుద్ధపరిశ్రమల ఉద్వాసన కార్యక్రమాన్ని ఇదివరకే పూర్తిచేసి ఉండవలసిందనీ, ఇంతదాకా ప్రాలుమాలిక చేసి ఎన్నికలు జరుగుతున్న సమయంలో జర్మనీలో దీనిని బహిరంగోపన్యాసాలకు విషయం కానివ్వడం చాలా తక్కువ అనీ విమర్శించెను. పరిశ్రమలను జాతీయం చేయకూడదని పశ్చిమజర్మనీ పార్లమెంటు చేసిన నిర్ణయాన్ని ప్రశంసించి, యూరోపియ సమితిలో జర్మనీకి సాధ్యమైనంత త్వరలో ప్రవేశం ఇవ్వవలెనని చర్చిల్ విజ్ఞప్తి చేసెను. భద్రతామండలి సభ్యత్వ ఎన్నికలలో, చెకోస్లావేకియా అభ్యర్థిత్వాన్ని బలపరచినందుకు బ్రిటిష్ ప్రభుత్వాన్ని విమర్శించెను. చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వంతో రాయబార సంబంధాలు ఏర్పరచుకోక తప్పదని చర్చిల్ అనెను.

## నెహ్రూ అంగీకారం

లండన్, నవంబర్ 18: సిలోనులో జరుగనున్న కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశానికి రావలసిందిగా పంపిన ఆహ్వానాన్ని పండిట్ నెహ్రూ అంగీకరించారు.

ఆయన ఈ అంగీకారానికి ఒకషరతు కూడా వున్నది. ఈ సమావేశం జనవరి ప్రారంభంలో మొదలౌతుంది. తాను దీనికి హాజరయ్యేపక్షంలో అది జనవరి 26 లోపుగా ముగిసి, తిరిగి తాను ఆనాటికి దేశంలోవుండే సావకాశం ఉండేటట్లు చూడాలని నెహ్రూ కోరారు.

1950 జనవరి 26 ఇండియా రిపబ్లిక్ రాజ్యంగా అవతరిస్తుంది.

కామన్వెల్తులోని కొన్ని రాజ్యాల విదేశాంగమంత్రులు ఈ సమావేశానికి స్వయంగా రాలేకపోవచ్చును. అయినా వారి ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొంటారు. దక్షిణఆఫ్రికా ఈ తెగలోపడింది.

కరాచీ, నవంబర్ 17: కొలంబోలో జరుగనున్న కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశంలో పాల్గొనవలసిందిగా కోరుతూ సిలోన్‌పంపినఆహ్వానాన్ని పాకిస్తాన్ ఆమోదించింది.

సిలోను ప్రభుత్వం ఈ సమావేశాన్ని జనవరిలో జరపాలని నిశ్చయించింది. పాకిస్తాన్ దాన్ని ఫిబ్రవరికిమార్చి స్తే బాగుంటుందని సూచించినట్లు తెలుస్తున్నది.

## ఆరబ్ కాందిశీకులకు బ్రిటన్ సహాయం

లండన్, నవంబర్ 17: అరబ్ కాందిశీకుల సహాయార్థం ఐక్యరాజ్య సమితి అమలు జరుపదలచిన కార్యక్రమానికి బ్రిటన్ శక్తివంచన లేకుండా తోడ్పడుతుందిఅని బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ ఈ వేళ కామన్స్ సభలో ప్రకటించారు.

## అ. భా. వ్యవసాయార్థిక సభ

మదరాసు, నవంబరు 18: పై సభయొక్క 10 వ వార్షిక సమావేశమునకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఆర్థికమంత్రి బి. గోపాలరెడ్డిగారును, కోశాధికారిగ బి. ఎస్. త్యాగరాజమదల్యారు, కార్యదర్శులుగా బి. నటరాజను ఎం. బాపినీడు గార్లును ఎన్నుకోబడిరి. తను యేర్పాటులు చేయుటకు ఏడు ఉపసంఘములు ఎన్నుకొనబడినవి. ఆహ్వానసంఘపు రుసుము రూ 25 గా నిర్ణయించబడెను. సభ 1949 డిశంబరు 30, 31 జనవరి, తేదీలందు జరుగును. డా॥ రాజేంద్రప్రసాదు గారు అధ్యక్షత వహింతురు.

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 20 ఆదివారం

## మద్రాసు (ఎ)

ఉ 7-30 ఉదయ సంగీతం (రి) 8 ఆంగ్లమున వార్తలు, 8-15 సినిమా సంగీతం (రి) మ. 1 ఎల్. రాజలక్ష్మి ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రాసహా 1-30ఆంగ్లమునవార్తలు1-40 సినిమాసంగీతం (రి) 2-15 మద్రాసు (బి) వలె 3 ఎస్. బాలసుబ్రహ్మణ్యం పాట 4 మద్రాసు (బి) వలె 4-30 పాశ్చాత్యసంగీతం (రి) సా 5-30 ఎస్. గోవిందరాజులు పాట. 6 ఆంగ్లమున వార్తలు 6-15 ఎస్. మనోన్మణి పాట. 6-45 టి. ఎస్. వాసుదేవన్ పాట. 7-30 గీతమంజరి. (రి) 7-45 మద్రాసు (బి) వలె 8 కె. లక్ష్మి కె. సరస్వతి పాట, 8-30 మద్రాసు (బి) వలె. 9 ఆంగ్లమున వార్తలు 9-15 కె. ఆర్. జయరామయ్యర్ పాట 9-45 పాశ్చాత్య సంగీతం (రి)

## మద్రాసు (బి)

ఉ 7 తెలుగున వార్తలు 7-15 లలితా సంక్రాంతి రికార్డులు 7-45 మద్రాసు (ఎ) వలె మ. 1 మద్రాసు (ఎ) వలె, 1-50 తెలుగున వార్తలు. 2-15 ఆటవిడుపు, నిర్వహణ: న్యాయపతి రాఘవరావు. 3 మద్రాసు (ఎ) వలె. 4 కదంబం (రి). సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-15 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం. గీతి కాకథలు. మేరీ రికార్డులతో కూర్చిన కథ. 7 తెలుగున వార్తలు. 7-15 గ్రామస్థుల కార్యక్రమం. గోవ్యాధులు—పాట్యాయనము. భోజరాజీయమునుండి పురాణకాలక్షేపం. 7-45 నేటి విద్యాభ్యాస సమస్యలు. మధ్యతరగతి ప్రసంగం. 8 మద్రాసు (ఎ) వలె. 8-30 పరూర్, ఎ. సుందరయ్యర్ వయొలిన్. 9 మద్రాసు (ఎ) వలె. 9-45 శ్రోతలు కోరిన పాటలు (రి).

## విజయవాడ

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 పెమ్మరాజు శ్రీనివాసయ్యర్ రికార్డులు. 7-30 సై. శ్యామలాదేవి పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా. 8-30 వినుకిడి. వెలకరా, పాట. రచన వార్ల చిరంజీవి. తీరని ఋణము, కథానిక యం. కె. సుబ్రహ్మణ్యం అపోహలు. రూపకము చావలి వెంకటశాస్త్రి. మ. 1 తోరాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 4 పేరంటం. శృంగారించుకొని నడలిరి. కవితాసతి ఛాయలు. శృంగారఛాయ ప్రసంగం నూతనకాంతి బాప్పాయి ప్రసంగం. సా. 5-30 పుల్లెల పేరి సోమయాజులు వయొలిన్. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి. బి. రాజరత్నం రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసు నుండి) 7 తెలుగున వార్తలు. 7-30 సై. శ్యామలాదేవిపాట. 7-45 చిత్రవాణి (రి). 8. చోక్కా శ్రీరామమూర్తి పాట. 9. ఆంగ్లమునవార్తలు. 9-15 చిత్రవాణి (రి). 9-30 పుల్లెలపేరి సోమయాజులు వయొలిన్.

## హైదరాబాదు

ఉ. 7-30 అజీజార్ రహమాన్ ద్వారా గీత్. 7-45 భజన్ (రి). 8. ఆంగ్లమున వార్తలు. 8-20 సంగీతపట్టం. 8-30 ఎం. ఎల్. సుబ్రహ్మణ్యం-కర్నాటక సంగీతం. 8-50 తెలుగున వార్తలు. 9-15 మన్కీబాయి. ఖయాల్ లలిత్. మ. 1. ఎం ఎస్. సుబ్బలక్ష్మి రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే). సా. 5. మన్కీబాయి తుమ్రీ. 5-15 అజీజార్ రహమాన్ ద్వారా గీత్ 5-30 మన్కీబాయి ఖయాల్. ఫీస్ప్లాస్ 6-30 మహిళా మండలి తెలుగున విఖ్యాత స్త్రీలు: ఆనిబిసెంటు ప్రసంగం జోల పాటలు పాల్గొనే వారు శారదాంబ సుసర్ల భానుమతి. పేరినదేవి. 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 గ్రామస్థుల కార్యక్రమం, తెలుగున. 'ఇంద్ర ధనస్సు' రికార్డులతో కూర్చిన కథ. 7-45 మనవ్యవసాయ సమస్య, తెలుగున ప్రసంగం.


ఆదివారాలు తప్ప మిగతా రోజుల్లో విద్యార్థుల టిక్కెట్లకు తగ్గింపు రేట్లు

ఛోటా భాయ్

బ్లిట్జు వ్రాసినది:—ఇటువంటి చిత్రం యిదివరకు యింతవరకు ఎండితెరమీద చూడలేదు. అపూర్వమైనది, మానవుల హృదయములను చలింపజేసి, అన్ని కాలములలో పనికివచ్చు మహోజ్వల చిత్రము.

ఫిలిం యిండియా వ్రాసినది:—ఈ చిత్రం మట్టిబొమ్మలకు ప్రాణం పోసినట్టుగా వుంది. ఈ చిత్రముయొక్క సృష్టి న్యూథియేటర్సువారి సాంప్రదాయములకు అనుగుణంగా వున్నది.

ఇపుడు ఉగువపోట్ల ప్రదర్శింపబడుచున్నది.

సాగర్ మదరాసు ☆ ప్రభాత్ బెంగుళూరు

రోజూ 3 ఆటలు. మ. 3 సా. 6-15, రా. 9-30 గం.

# నూతన రాజ్యాంగం

## తృతీయ ప్రతిపాదనపై పరిషత్తు చర్చ

న్యూఢిల్లీ, నవంబరు 17: నూతన భారత రాజ్యాంగ ప్రణాళికను నిన్న తాను ఖాయపరచిన స్వరూపంలో 3 వ సారి ఆమోదించటానికి రాజ్యాంగ పరిషత్తు నేడు చర్చను మొదలుపెట్టినది. రాజ్యాంగరచనా సంఘాధ్యక్షుడు డా॥ అంబేద్కర్ మసాయిదాను 3 వ సారి ఆమోదించవలసినదని ప్రతిపాదించాడు. 71 మందిపైన సభ్యులు ప్రసంగిస్తామని పేర్లను పంపారు.

ఉపన్యాసాలను డా॥ అంబేద్కర్ ప్రసంగిస్తాడని భావించబడినది కాని ఆయన సభ్యులను మొదట ప్రసంగించవలసినదని కోరటంవల్ల నిమ్నజాతి ప్రతినిధి మును స్వామిపిళ్లెగారు మొదట ఉపన్యసిస్తూ రాజ్యాంగాన్ని ప్రశంసించారు. అనంతరం సేట్ గోవిందదాస్ మాట్లాడుతూ దేశానికి భారత్ అన్న పేరును ప్రధానంగా రాజ్యాంగంలో వాడనందుకూ, ఇంగ్లీషు భాషలోనే దానిని ఆమోదిస్తున్నందుకూ, ఇంగ్లీషు అంకెలను వాడనిశ్చయించినందుకూ నిరసించాడు. అనంతరం లక్ష్మీనారాయణ్ సాహూ ప్రసంగిస్తూ కొత్త రాజ్యాంగం పనికిరాని చెత్త అనీ, అందులో పోషలిజానికి గల స్థానమేదో నిర్దేశించబడలేదనీ, నాయకులు తమ ఆశయాలను జారవిడిచారనీ, ఇండియా కామన్వెల్తులో ఉండకూడదనీ విమర్శించాడు.

రాజప్రముఖుల రిపబ్లిక్

కె. హనుమంతయ్యగారు ప్రసంగిస్తూ రాజ్యాంగ నిర్మాతలు జాతీయ సంస్కృతికి, గాంధీజీ ఆశయాలకు భిన్నంగాపెట్టారన్నారు. "రాజ్యాంగంలో ఒక వ్యక్తి సంగమనించలేకపోతే. పైన బ్రిటిష్ రాజుతోనూ కింద రాజప్రముఖులతోనూ భారత రిపబ్లిక్ అవతరిస్తున్నది." అని ఆయన విమర్శించాడు.

ప్రొ॥ కె. టి. షా మాట్లాడుతూ కొత్త రాజ్యాంగం ప్రజాస్వామ్యాన్ని సృష్టించలేకపోయిందనీ, అధ్యక్షుడికి, తద్వారా ప్రధానికీ ఇవ్వబడిన అధికారాలు నియంతృత్వానికి దారితీయగలవనీ, ఈ రాజ్యాంగంలోనుంచి ఫాసిజం ఉద్భవించే అవకాశంకూడా, ఉన్నదనీ హెచ్చరించాడు. దీనిని ఆమోదించేముందు 'రిఫరెండం' ద్వారా జనవాక్యాన్ని నిర్ధారించవలెనని ఆయన ప్రతిపాదించిన సవరణలు వీగిపోయినవి. 'మీరు ప్రజల్లోనే కాక మీ నాయకత్వంలోనే విశ్వాసాన్ని కోల్పోయినారు. ప్రజలకు తగిన విద్య, అనుభవం లేదన్న కారణంమీద మీరు ప్రజాభిప్రాయాన్ని తీసుకోడానికి జంకడినట్లు బ్రిటిష్‌వాళ్లుకూడా చేసియుంటే మనకు స్వాతంత్ర్యమే వచ్చియుండేది కాదు" అని ఆయన విమర్శించాడు. ఎన్ని లోపాలున్నా 10 ఏళ్లలో ఈరాజ్యాంగం కింద ప్రజాస్వామ్యాన్ని నిర్మించే అవకాశం లేకపోలేదని ఆయన అన్నాడు.

ప్రభూనోత్పత్తి సాధనాలన్నిటిమీదనూ ప్రభుత్వానికే సంపూర్ణ యాజమాన్యం ఇవ్వాలని ఆయన ప్రతిపాదించిన సవరణ వీగిపోయింది.

ఆర్. కె. సిధ్వా నూతన రాజ్యాంగాన్ని సమర్థిస్తూ మాట్లాడాడు. ప్రతి భారతీయుడూ దానిని చూసి గర్వించవచ్చునని అన్నాడు.

ప్రపంచానికే దృష్టాంతం

ఆచార్య రంగాగారు మాట్లాడుతూ అనేక విషయాల్లో ఈ రాజ్యాంగం ప్రపంచానికి దృష్టాంతంగా ఉన్నదని అన్నారు. నీగ్రోలకు పౌరహక్కులు ఇవ్వటానికి అమెరికాలో ట్రూమన్ ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాడు కాని ఇండియా అస్పృశ్యతను పూర్తిగా నిర్మూలించినదని ఆయన ప్రశంసించాడు. ప్రాథమిక హక్కుల విషయమై ఉన్న నిర్బంధాలు దేశకాల పరిస్థితులను పట్టి అనువుగానే ఉన్నప్పటికీ, రాజ్యాంగంలో అధికారం ఎక్కువగా కేంద్రీకృతం చేయబడ్డదని అనవలసి వస్తుందని ఆయన అన్నాడు. ఆంధ్రరాష్ట్రం వస్తున్నందుకు ఆయన నెహ్రూ, పటేల్ లకూ, పరిషత్తు సభ్యులకూ కృతజ్ఞత చెప్పించాడు.

నజీరుద్దీన్ అహ్మద్ ముసాయిదా భాషలో వ్యాకరణదోషాలను సరించి విమర్శించాడు. ఉపరాజప్రముఖులు అనవసరమన్నాడు.

జాతీయ గీతం

బి. దాస్. మాట్లాడుతూ సోషలిస్టులు కూడ ఇంతకన్నా ఉత్తమ రాజ్యాంగాన్ని తయారు చేయలేవన్నాడు. జనవరి 26వ తేదీన ఇండియా కామన్వెల్తు నుంచి వైదొలగాలని ఉద్ఘాటించాడు. బ్రిటనే మన ప్రస్తుత ఆర్థిక దుస్థితికి మూల కారణమని నిందించాడు. జాతీయగీతం పీఠం రాజ్యాంగాన్ని మూడోసారి ఆమోదించేముందే నిర్ణయించాలని హెచ్చరించాడు. రాష్ట్రాన్ని కంపోనిస్తున్నందుకు ఆంధ్రులను అభినందించాడు.

సమావేశం రేపటికి వాయిదా పడింది.

# ప్రజా శాంతి రక్షణ చట్టం

## లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆమోదం

మదరాసు, నవంబరు 17. "కలెక్టరు సలహాను పెడచెవినిబెట్టి ఒక కమ్యూనిస్టును విడుదల చేయుటవలన ఫలితం నూర్పిడి నిలిచిపోయింది. అమాయక ప్రజారక్షణకు బిల్లులో ఉద్దేశించిన అధికారములు ప్రభుత్వమునకు అవసరం," అని న్యాయమంత్రి శ్రీ మాధవ మీనన్ నేడు కవున్సిలులో ప్రజారక్షణబిల్లును సమర్థించిరి. ఈబిల్లును నేడు కౌన్సిలు ఆమోదించినది.

కౌన్సిలు యీవాళ శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి అధ్యక్షతన సమావేశమైనపుడు ప్రశ్నల అనంతరం అధ్యక్షుడు శ్రీ యస్. వి. ఆదిత్యన్‌గారు ద. ఇ. రైల్వే సలహాసంఘ సభ్యుడుగను, శ్రీ యుయులు వీరభద్రస్వామి చౌల్, సుబ్బరామిరెడ్డి, పి. యస్. శ్రీనివాసన్, రామనాథన్ చెట్టియార్, హెచ్. యం. జగన్నాథం, సయ్యద్ తాజుద్దీన్, మిసెస్ హెన్సమన్, ఆర్. సూర్యనారాయణరావుగార్లు సభాసంఘ కమిటీ సభ్యులుగను ఎన్నికగాంచినట్లు ప్రకటించిరి.

శాసన లాశాఖా మంత్రి శ్రీ మాధవ మీనన్‌గారు ప్రజాశాంతి రక్షణ బిల్లును సభవారి ఆలోచనకై ప్రతిపాదిస్తూ దేశములో న్యాయస్థానములు యీ శాసనమునకు సంబంధించిన వెనుకటి చట్టము జీవితకాలం అంతమైపోయి యుండినందువ అట్టి దానికి జీవము పోయుచూ ప్రకటించిన అర్డినెన్సుల్లు అసలు చట్టము చెల్లునాయనే విషయమై సందేహము తెలిపిన కారణము చేత పై బిల్లు సభవారి ఎదుట తేవలసి వచ్చినదని తెలిపిరి. ఈ కొత్త బిల్లులో కొద్ది మార్పులు చేయబడి యున్నదనిరి. 1952 సెప్టెంబరు 30వ తేదీ వరకు యీ చట్టముండును. డిటెన్యూలు పెరోలు మీద వుండి పెరోలు షరతులను అతిక్రమించేయడల వాని విషయంలో చర్యతీసుకొనుటకు వలయు నియమములు కూడా యీ కొత్త బిల్లులో చేర్చబడిన వనిరి. డిటెన్యూలు నిర్బంధించుటకు గల కారణములను ఆ వ్యక్తులకు తెలియజేసేటప్పుడు వాటిలో ఏ పైనా లోపాలున్నను కారణములు సంపూర్ణముగా లేకపోయినను కోర్టులు ఆ లోపాలను ఆక్షేపింపవీలులేదని శాసించుటకు సెక్షను 4 (ఎ) చేర్చబడియున్నదనిరి.

ప్రతిపక్షనాయకుడు వి. కె. జాన్‌గారు ప్రజాశాంతి రక్షణబిల్లును సెలక్టు కమిటీ ఆలోచనకు పెట్టవలెనని ప్రతిపాదించుచూ ప్రభుత్వము ఊరక ఆర్డినెన్సుల మూలముననే పరిపాలించడం తగదనిరి. ప్రభుత్వము ఈ బిల్లువిషయమున న్యాయస్థానముల కధికారములేకుండా చేయుటకు యెంచుచున్నది. కోర్టులు అసలేలేకపోవలెనని ఈ ప్రభుత్వము అభిప్రాయము కాబోలు!

కమ్యూనిస్టుల ఘోరకృత్యాలను విస్తవకరమైనచర్యలను ప్రతిపక్షములో ఎవరూ అభిమానించుటలేదు. అయితే కమ్యూనిస్టుల ఉపద్రవమును అరికట్టుటకు యిట్టి నిర్బంధవిధానము ఎన్నటికీ ప్రయోజనపడదు. దేశప్రజలలో కలుగుచున్న అసంతృప్తిమీద కమ్యూనిస్టులు తమపార్టీని బలపరుచుకొని వ్యవహరించుకొనుచున్నారు గనుక దేశప్రజల అవసరాలను తృప్తిపరచి ప్రజాబాహుళ్యము సుఖీతముగా నుండునట్లు ప్రభుత్వముచేయగల్గితే కమ్యూనిస్టుల ప్రాపకమును సులభముగా తగ్గించివేయవచ్చును. ప్రభుత్వమువెంటనే పచారాలగరలు అదుపులోవచ్చునట్లుచేసి కంట్రోలును తొలగించితే ప్రజలలో అసంతృప్తి తగ్గును. ప్రభుత్వము ఈ మార్గమును అనుసరించుటకుమారుగా సందేహించే ప్రతి వ్యక్తి పౌరహక్కులను భంగపరుచుటకు పూనరాదనికోరిరి. ఈ బిల్లులోని షరతులు పౌరహక్కులకు చాలా ప్రతిబంధకముగా నున్నందున బిల్లును సెలక్టుకమిటీ ఆలోచించవలెననిరి.

శ్రీ నారాయణస్వామి నాయుడుగారు కొత్త ప్రజాశాంతి రక్షణబిల్లు వెనకటి శాసనంలో నున్నదానికంటే మరింతకఠినమైన షరతులుకలవనియు ఈశాసనము క్రింద ప్రభుత్వాధికారి నిర్బంధింపవలచే వ్యక్తికి న్యాయస్థానానికి వెళ్ళి పరిహారమేమైనా పొందుటకుపయుక్తం హక్కులేక చేయబడియున్నదనిరి. అందువల్ల యిట్టినిరంకుశాధికారములను ప్రభుత్వానికిచ్చేబిల్లునిగాన సెలక్టుకమిటీ అభిప్రాయము పొందుటచాలా అవసరమని శ్రీ నాయుడుగారు ప్రతిపాదనను బలపరచిరి.

మధ్యాహ్నముకౌన్సిలు ఫలహారానంతరం తిరిగి సమావేశమైనపుడు శ్రీ ఖేమారావుగారు ప్రజారక్షణచట్టంపై తమ ఉపన్యాసమును కొనసాగించుచు, ప్రాంతదేశాలు దీనికి శాసనాలు చేస్తున్నాయి అని వెటకారం చేసిన, అనేక ఆర్డినెన్సులు చేయ నవసరముండేదికావనియు, అర్డినెన్సులు అవినాలే ప్రజలకొక ఆపాయకరమనియు, గాంధీగారు, గా॥ శ్రీనివాసశాస్త్రిగారు వాటిని విమర్శించి యుండిరని తెలిపిరి. డిటెన్యూల కేసులు విచారించుటకు పెంచు సలహాసంఘాలు చాలవు. ప్రాంతీయ సంఘాలు నియమించాలి. ఆను చెలవరకు ఎటువంటి పరిశీలనలేక కారణం చెప్పక నిర్బంధించరాదు.

అధ్యక్షులు:—మనుష్య జెయిలునుండి విడుచుటకు రెండేండ్లు పట్టును.

ఖేమరావు:—అధ్వయుజయుల ప్రభుత్వం వలెనే యీ ప్రభుత్వంవారును చేయాలా? స్థానికసలహా సంఘాలుంటే, అనవసరంగా నిర్బంధించడాలు తగ్గిపోతాయనిరి.

ఆర్. సూర్యనారాయణగారు, యీ ప్రభుత్వంవారు జనకటి ప్రభుత్వానికి ప్రతిగామిందని చెరుగాలేదని యీ చట్టాలు బుజాపు చేయుచున్నవనిరి. ఇపుడు నిర్బంధింపబడిన వారు గూడ నేరస్థులని నేను భావించను. 1947 సం॥ ప్రకాశంగారి చట్టం మరికొన్ని సెక్షనులతోగూడ, 1950 వరకు గూడ అమలు నందుంచదలచుట కేవలం ఆక్షేపణీయం. సెలక్టుకమిటీకి పంపకుండా కూడా చట్టం చేయుట మరీ అన్యాయం. కమ్యూనిస్టులపై నిందలని ప్రకటించిన పుస్తకంలో కొన్ని ప్రాంతాలలోనే వాటిని సూచించెను. కాని యీ చట్టం రాష్ట్రం అంతకు వర్తింప జేయుచున్నారు. చట్టానికి ప్రతికూలంగా మాట్లాడిన శాసన సభ్యులందరినికూడా పోలీసువారు అనుమానాల జాబితాలో రేపు పడేవచ్చును. కోర్టుల అధికారాన్ని తొలగించు 4 ఎ. క్లాజునకు లాయరయిన మంత్రిగారు ఎట్లు సంతకంచేసిరో తెలియకుండా యుంది. కొలటు ఆక్షుకంటె యీ చట్టాన్ని అంగీకరించరాదనిరి.

డా॥ లక్ష్మణస్వామిమదల్యారు గారు దేశంలో అరాచకం లేకపోలేదు కాని, దాన్ని తొలగించుటకు దేశంలో పరిస్థితులను మార్చుటకు ప్రయత్నించాలనిరి. 4 ఎ సెక్షను అన్ని మానవ హక్కుల సిద్ధాంతాలకు విరుద్ధంగానుంది. కొడుకు తండ్రిని డబ్బుడిగి శాసనోల్లంఘనంచేస్తే, అట్లా చేస్తాడని తెలియకపోయినా తండ్రిని శిక్షించుటకు యీచట్టంలో అవకాశం వుంది. ఆతను శిక్షనుండి తప్పించుకొనన అప్ఫీలు చేయ వీలులేకుండా 4 ఎ. సెక్షను నిరోధించుచున్నది. ప్రజావరణ లేనిది ఏ చట్టమును అమలుజరుపుట కష్టం. కనుక హైకోర్టు అధికారాన్ని తొలగించు క్లాజులు యీ చట్టంలో నుండరాదు.

యూనిఫారము దుస్తులతో నుండు వాలంటీరు దళములను అణచివేయుట మంచిదే. లేకున్న అవి రాజకీయ సిద్ధాంతాల ననుసరించి అరాచకంలోకి దింపగలరు.

అర్డినెన్సు రాజ్యం ప్రజా రాజ్యమే కాదు. ఇంతెందైల చట్టం సెలెక్టు కమిటీకి పంపకుండా దాన్ని ఉపసంహరించి అర్డినెన్సు చేసిరి. ఇట్టి చర్యలు సహింపరానివి.

జాన్—రామరాజ్యం అనుసరిస్తున్నారు.

అన్యతుడు— రామరాజ్యం రోజులలో శాసనసభలు లేవు. కనుక ఆపద్ధతి నే మంత్రు లనుసరించు చున్నారు.

డా॥ అ. ల. మదల్యారు గారు, సెలక్టు కమిటీకి పంపంది ఏచట్టము చేయరాదని నుడివిరి

ఎన్. రంగారెడ్డి గారు చట్టమును బలపరుచుచు ప్రస్తుత మున్న ప్రభుత్వ ప్రతికూలురు వెనుకటి వారివలె గాక, దౌర్జన్య పద్ధతుల ననుసరించు చున్నందున అప్పటి శాసనాలకన్న కఠినమయిన శాసనాలు చేయాలనిరి. చట్టాన్ని రాష్ట్రమంతకు వర్తింప జేయరాదనియు, గ్రామాలలో అన్ని పార్టీలకు యిది వర్తించేటటులు చేయరాదు,ఒక్క కమ్యూనిస్టులకే వర్తించాలనియు తెలిపిరి. కమ్యూనిస్టులని అనుమానం ఉన్న తప్పను రిపోర్టులు వచ్చినా శిక్షించరాదు. జాగ్రత్తగా దీన్ని అనుసరించాలి. పోలీసులు రుసావులు కాల్చి కొందరిని చంపినపుడు పబ్లికు విచారణ జరిపించాలి.

శ్రీ మోతే నారాయణరావు గారు, కృష్ణా జిల్లాలోనే కమ్యూనిస్టుల ప్రమాదం ఎక్కువగా నుండగా చట్టాన్ని ఆ జిల్లా సభ్యుడే ఎదిరించుట వింతగ నుందనియు, బహుశా ఆతను కమ్యూనిస్టుల అభిమానం పొంద జూస్తున్నా డేమో ననిరి. ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వానికి సర్వాధికారం ఉండాలి. బలహీన ప్రజా ప్రభుత్వం కన్న నిరంకుశ ప్రభుత్వం ఉండుట అవసరమేమో ననిరి. నేటి దేశంలో మన్ని పరిస్థితులకు బ్రిటిషు పరిపాలనయే కారణం గాని, కాంగ్రెసు ప్రభుత్వం కాదనిరి. గాంధీ సిద్ధాంతాలను అందరు అనుసరించినచో కమ్యూనిస్టు బాధయుండే దికాదనిరి. గ్రామ పరిపాలనా విధానం వచ్చి గ్రామములకు స్వపరిపాలనాధికారం యిచ్చినచో చాల చిక్కులు తొలగిపోగలవనిరి. అదియే రామ రాజ్యమనిరి. స్థానికోద్యోగులు అధికారాలు దుర్వినియోగం చేయకుండా మంత్రిగారు చూడాలి. వీలూరులో హోటలును పోలీసులు దాడి చేసిరి. అందు కమ్యూనిస్టు ఉన్నాడో లేడో తెలియదు. గ్రామమందందరు ఖాళీచేసిన గ్రామంలో దూరి అస్తులను పోలీసులు అపహరించిరని, అట్టి చర్యలు జరుగరాదనియూ సూచించిరి.

శ్రీ యం. పి. నారాయణమీనన్ సెక్షన్ 4 (ఎ) వల్ల హానిలేపోవక్కరలేదని కమ్యూనిజమునుండి రాజ్యమునుసంరక్షించవలెననిరి.

జనాబ్ అబ్దుల్ లతీఫ్ ఫరూకీ వ్యక్తిస్వాతంత్ర్యమునకు క్షతి ఏర్పడినదని రక్షించవలెననీ అయినాబిల్లును సెలెక్టు కమిటీకి పంపుటలో ఉలపోయేది ఏమీ లేదన్నారు.

జనాబ్ కె. టి. యం. ఇబ్రహీం ఈ బిల్లులో ఉద్యోగులకు ఇవ్వబడిన విపరీత అధికారములు దుర్వినియోగము కాకుండా చూడవలెననిరి. సలహాసంఘముతోపాటు జ్యుడిషియల్ ట్రిబ్యునల్ నుకూడ ఏర్పరచవలెననిరి.

తరువాత న్యాయమంత్రి జవాబు ఇచ్చుచూ ఇట్లనిరి. అసంతృప్తిని తొలగించుట మంచిదని ప్రతిపక్షనాయకుడు అన్నాడు. ఇది ఒక విషచక్రము, అల్లరి చేయువారే అసంతృప్తులు. కొంతమంది అసంతృప్తిని సృజించేవారుకూడా యున్నారు. హైకోర్టు ఆజ్ఞ ననుసరించి కొంతమంది విడుదలచేయబడిరి. వారిని విడుదలచేసిన పంటనూర్పిడు వుండవని కలెక్టరు హెచ్చరించాడు. ప్రభుత్వము హెచ్చరికను పెడచెవినిబెట్టి సాహసం చేసి వారిని విడుదల చేసినది. తత్ఫలితము గా కోతలు ఆగిపోయినవి. పూడ్పులు మార్పిడులేనిరోజుల ప్రభుత్వము ఆహారం సప్లయి చేసేది ఎట్లాగ పంపించుటయే అసాధ్యమైనదని.

కవున్సిలులో పంకాలక్రింద కూర్చొని ధర్మపన్నాలు ఎన్నైనా చెప్పవచ్చును. రహస్యచర్యలు ప్రబలమై, పౌరసత్వాలకే భంగం వాటిల్లు ఈ వాతావరణములో ప్రజారక్షణార్థము ఈ అధికారములు చాల అవసరము. నోర్మెన్‌రాక్ వద్ద పట్టాలు తొలగించి ప్యాసింజరు బండిని పడవేసిన ... ఇంజన్‌ను పట్టాలు తప్పించుట, అక్కడ తీర్పుటకుగాదు. పట్టపగలు కాంగ్రెసు సంఘ అధ్యక్షుణ్ని కొట్టింది ఆకలివలన గాదు. కమ్యూనిస్టు నేరసంఘమును ఏర్పరచినందున కొట్టిరి. నేను ఒక తెలుగు గ్రామమునకు పోలీసులతో వెళ్ళి అక్కడ రక్షణకొరకు ఖూనీచేస్తే ... క్రింద నేరముగాదని ఎలుగెత్తి చెప్పినా 5 వేలమంది జనంలో ఒక్కడుకూడా 6 గురికి దగని ముందుకు రాలేదు. అతగ్గరిని నిర్బంధించిన తరువాత ప్రజలు నిర్భీతిగా బయటకువచ్చిరి. 5 వేలమంది పౌరసత్వాలు రక్షించుటకు 6గురి పౌరసత్వాలు తీసి వేయక తప్పలేదు.

హైకోర్టు యెడల ప్రభుత్వమునకు అవిశ్వాసము లేదు. శాసనములను నిర్వచించు అధికారి హైకోర్టేనని న్యాయమంత్రి అనిరి.

ఇది విపక్కరపరిస్థితులలో విపరీతాధికారములు గల శాసనము. 4 (ఎ) క్లాజును కొత్తగ చేర్చినందువల్ల మాత్రమున బిల్లును సెలెక్టు కమిటీకి పంపుటను అంగీకరించవీలు లేదనిరి.

బిల్లును సెలెక్టుకమిటీకి పంపవలెనను శ్రీ వి. కె. జాన్ ప్రతిపాదన ఓటుకు పెట్టగా వీగిపోయెను.

క్లాజువారీ అంగీకరించబడిన తరువాత మొదట ప్రతిపాదించిన బిల్లు శాసనముగా అంగీకరించబడినది. సభ మర్నాటికి వాయిదా పడెను.

# ఇది కౌన్సిల్ ఆఖరు సమావేశమా?

## లాబీ ముచ్చట్లు

మద్రాసు, నవంబరు 17:

నేడు మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు సమావేశమవటానికి పూర్వం, సభ్యులు వచ్చినవారంతా ఆంధ్రరాష్ట్రమునుగూర్చి కొంత ముచ్చటించుకొనిరి. ఈసమావేశంతో తమ సభ్యత్వము ముగిసిపోదు న్నట్లున్నా, ఇదే ఆఖరి సమావేశమైనట్లున్నా, వారి వారి భవిష్యత్తునుగూర్చి భలో ప్రసంగించుకొనిరి. ఖేమా రావుగారు మాగతి ఏమికానో అని అడుగగా డా॥ లక్ష్మణస్వామి మొదలియార్‌గారందుకొని మీకు త్రిశంకుస్వర్గమేనని చెప్పిరి. మాధవమీనన్‌గారు, బళ్లారిజిల్లా యావత్తు, కర్ణాటకరాష్ట్రం ఏర్పడునవరకూ ఆంధ్రరాష్ట్రంలో చేర్చబడగలదనిరి. ఆర్. సూర్యనారాయణరావుగారు నామినేటెడ్ సభ్యులగతి ఏమికావలెనో అని పల్కిరి. కౌన్సిలులో డా॥ జాన్‌గారు తెచ్చిన విరామ తీర్మానంకూడ కౌన్సిలు సభ్యుల కలతజెందిన అంతరంగాన్ని వ్యక్తం చేస్తున్నది. ప్రభుత్వంవారు ఏమిచేసినా ఉభయ శాసనసభలలో సంప్రదించే చేస్తామని కౌన్సిలు సభ్యులకిచ్చిన అభయం, వారి భయసందేహాలనుమాత్రం, నివారణ చెయ్యలేదు.

# బ్యాంకులకు సర్ బి. రామారావుగారి హామీ

మదరాసు, నవంబరు 18: "బ్యాంకులన్నింటిని సాలీనా ఒకసారి పరీక్షించు ఏర్పాటు రిజర్వుబ్యాంకు చేసినప్పటికీ, చిన్నరాష్ట్రంలో సాంప్రదాయసిద్ధంగా జరుగు బ్యాంకింగు వ్యవహారములకు ఏటువంటి ఆటంకము ముండదు" అని సర్ బి. రామారావుగారు, రిజర్వు బ్యాంకు గవర్నరు నిన్న సాయంకాలం ద. ఇ. జాయింటు స్టాకుబ్యాంకుల సంఘమువారు హైకోర్టు ఎదురుగ మైసూరు బ్యాంకువారి భవనమువం దొసంగిన విందు సందర్భమున ప్రసంగించుచు నుడివిరి.

శ్రీ భో. వెంకటరత్నం, ఎస్. భాస్కరను మున్నగువారు అతిథులకు స్వాగతమొసంగిరి. అల్పాహారముల విందు అనంతరం శ్రీ దోర్బల శోభనాద్రిశాస్త్రిగారు (సెంట్రలుబ్యాంకు) రామారావుగారికి స్వాగతం తెల్పుచు, దక్షిణాదిన బ్యాంకులు చిటుఫండులు నిధులు ప్రారంభించి పేదవారికి చాల తోడ్పడుచున్నవనియు, ద. ఇ. బ్యాంకుల సంఘం ఏర్పడుట చాల యుక్తంగా నున్నదనియు నుడివిరి.

సర్ రామారావుగారు తాము ప్రభుత్వోద్యోగిగ అర్థికశాఖయందు పనిచేసినపుడు, అవసరంవచ్చి కొన్నాళ్లు సెలవు పెట్టి ఆరు నెలలపాటు బ్యాంకింగు వ్యాపారమునందు కొద్దిపాటి అనుభవం గడించితిననియు, తెలిపిరి. ప్రభుత్వ రాయబారియొక్క ముఖ్య కార్యములు గూర్చి బ్యాంకింగు ఆర్థిక పరిస్థితులకు సంబంధించినవే ననిరి.

"మదరాసులో ప్రత్యేకపద్ధతు లున్నవని నే నెరుగుదును. కనుక ఆ విషయం మదరాసు బ్యాంకులగూర్చి విచారించునపుడు గమనింతును.

"బ్యాంకులను వార్షికంగా తణిఖీచేయునపుడు వాటికి తోడ్పడుటకే, జరిపెదము గాని, అవి సాంప్రదాయసిద్ధంగా అనుసరించిన పద్ధతులకు భంగం రానీయమని వేరొకసారి హామీ యిస్తున్నాను. నిధులు, చిటుఫండులు, సహకార బ్యాంకింగు పద్ధతులు యీ రాష్ట్రంలో సంతృప్తికరంగా పనిచేయుచున్నవి. దేశంయొక్క వర్తకవ్యాపారాలకు అరిష్ట దాయకంగా కేవంతకాలం వివిధరకాల బ్యాంకులు చేయు వ్యాపారములజోలికి రిజర్వుబ్యాంకు పోదు" అని గూడా హామీ యిచ్చిరి.

ఎస్. భాస్కరముగారు వందనములర్పించుచు పెద్దూళ్లు కాని బ్యాంకులుగూడ గ్రామాలలో యిమిడియున్న ద్రవ్యాన్ని బయటకుతీసి తమసహాయం చేస్తున్నవని గమనించాలని సూచించిరి.

# మదరాసు మంత్రులతో సర్. బి. రామారావుగారి సంప్రదింపు

మదరాసు, నవం 17: మదరాసు ఆర్థిక మంత్రి రిజర్వుబ్యాంకు గవర్నరుతో సర్. బి. రామారావుగారు ప్రభుత్వ ఆర్థిక విషయముల గూర్చి చర్చించిరి. ప్రభుత్వం రు30కోట్లను ఇరిగేషనుఖర్చులకు మంజూరు చేసియుండిరి. వీటికిని యితర పెట్టుబడులకు ప్రభుత్వంవారు మార్కెటులో ఋణం చేయుటకు యిదివరకు నిశ్చయించియుండిరి. ఈ సూచన సబబుగా నున్నది రామారావుగారు అభిప్రాయం తెలిపినట్లుంది. ఒక విడాదిలోగా మదరాసు రాష్ట్రంలో గూడా ద్రవ్యవకాశములు సులభమగునని వారు భావించుచున్నారు. చర్చలు ఒక గంట జరిగినవి. ఆర్థికశాఖ కార్యదర్శి, అసిస్టెంటు కార్యదర్శికూడా యుండిరి.

# మద్యనిషేధపు అరెస్టులు

పొన్నూరు, నవంబరు 14:—చేబ్రోలు వాస్తవ్యులు రహిమాన్‌ఖాన్, రాఘవయ్యలను, నిడుబ్రోలు వాస్తవ్యులు మల్లెల శ్రీరాములు, నల్లబాడి చంద్రయ్యలను, మునిపల్లె వాస్తవ్యుడు పాలడుగు శీతారామయ్యను, త్రాగినందులకు, మద్యనిషేధ సబిన్స్పెక్టరు ఎ. శివనాగయ్యగారు అరెస్టు జేశారు.

మునిపల్లె వాస్తవ్యురాలు లోడిమల వాగమ్మ వద్ద 13 చిన్నముల గంజాయిని, చేబ్రోలు వాస్తవ్యుడు దాసరి రాఘవయ్య వద్ద 14 డ్రాముల కాపుసారాయిని, పట్టుకుని, వారిద్దరను అరెస్టు జేశారు.

పొగాకు నారుపేర్ల క్రింద దాచబడి, చందోలునుంచి లారీలో అక్రమ రవాణా చేయబడుచున్న 4 బస్తాల ధాన్యమును, పన్నుల తాడిపర్రువద్ద సి. ఐ. డి. డిప్యూటీ సూపర్నెంటుగారు 12వ తేదీ రాత్రి, పట్టుకుని, స్వాధీనపరచుకున్నారు.

[స్వ. వి.]

# చేజిక్కిన కమ్యూనిస్టు పలాయనం

## భీమవరంవద్ద సంఘటన

భీమవరం, నవంబరు 16: పూర్వ గోదావరికి చెందిన నడింపల్లి సుబ్బరాజు అనే ప్రముఖ కమ్యూనిస్టును ఇక్కడికి 7 మైళ్ల సమీపంలోనున్న కోరుకొల్లువద్ద గత సాయంత్రం ప్రత్యేకశాఖ సబిన్స్పెక్టరు శ్రీ ఐ. హనుమంతరావుగారు, నలుగురు కానిస్టేబిళ్ళ సహాయంతో అరెస్టుచేశారు. సుబ్బరాజును తీసుకుపోతుండగా అరకల్లి రైల్వేస్టేషనుకు వందగజాలదూరంలో ఒకచోట 50 మంది కమ్యూనిస్టులు పొంచి వుండి పోలీసువారిపైబడి, ఒక రివాల్వరును, తూటాలను లాక్కొని, సుబ్బరాజును విడిపించుకున్నారు. ఇన్స్పెక్టరుకు తలమీద, ఒంటిమీద తీవ్రమైన గాయాలు తగిలి ఆస్పత్రిలో చేర్చబడ్డారు. పోలీసులు కేసును దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

# ప్రముఖ కమ్యూనిస్టు అరెస్టు

ఏలూరు, నవంబరు 18: పోలీసు ఇన్స్పెక్టరు పి. బి. రామారావుగారు ఎ.ఎస్. రామారావు, కె. వెంకటరత్నం, చింతా వెంకటేశ్వరరావు సబిన్స్పెక్టర్లగార్ల సహాయంతో గతసాయంకాలం కాట్నేని పెదకాశి అను పెదపాడు ప్రముఖ కమ్యూనిస్టును అతని స్వగృహంలో అరెస్టు చేశారు. ఇతనిపై గత మూడు సంవత్సరాలనుండి అరెస్టువారెంటున్నది. ఇతడు లోగడ ఒకసారి పోలీసులకు చిక్కి, తప్పించుకొనిపారిపోయి వుండెను. ఈ నెల 10వ ఇక్కడి తాజ్‌మహల్ హోటలు వద్ద పోలీసులకు చిక్కకుండా కొద్దిలో తప్పించుకొని పారిపోయెను.

## ఇద్దరు కమ్యూనిస్టుల అరెస్టు

చాలా కాలంనుంచి పరారీలోయుండి, పోలీసులకు కావలసియున్న దాసరి శివరామకృష్ణయ్య, యలవర్తి రాఘవయ్య అను యిద్దరు కమ్యూనిస్టులను నేడు మునిపల్లె గ్రామంలో, పోలీసు సర్కిలు యిన్స్పెక్టరు కె. చంద్రమౌళి, జూపూడి సబిన్స్పెక్టరు కె. మాణిక్యరావుగార్లు, అరెస్టు గావించారు. (స్వ. వి.)

# సెకండరీ గ్రేడు టీచర్లకు రాజమండ్రిలో శిక్షణ

రాజమండ్రి, నవంబరు 15: ప్రభుత్వం పరిగణించిన పాఠశాలల్లో మూడేళ్ళకు తక్కువకాని అనుభవంకల "సెకండరి గ్రేడ్ ట్రెయిన్డ్ గ్రాడ్యుయేట్ టీచర్ల"కు డిసెంబరు 1వ తేదీనుండి 3 నెలలపాటు స్వల్పమగు ట్రెయినింగు కోర్సు రాజమండ్రి ప్రభుత్వ ట్రెయినింగు కాలేజీలో ఏర్పాటు చేయబడుచున్నది. ఈ నెల 23 వ తేదీకిముందే అందునట్లుగా ట్రెయినింగు కాలేజి ప్రిన్సిపాలుకు కోరినవారు దరఖాస్తులు పంపుకోవలెను. అభ్యర్థులు ప్రిన్సిపాలుకు వ్రాసి దరఖాస్తు పత్రములు, ఇతర వివరములు తెప్పించుకోవచ్చును. అని ప్రిన్సిపాలు కె. సత్యనారాయణగారు ప్రకటిస్తున్నారు.

# స్థానికసంస్థల బడ్జెటులు

తిరుపతి, నవంబరు 15: నవంబరు 30వ తేది లోపుగానే స్థానిక సంస్థలు తమ బడ్జెట్టులను ప్రభుత్వమునకు పంపవలయునని ఇదివరకే ఉన్న వుత్తర్వు మరలను రివ్వూ ఆ ప్రకారం 1950–51 బడ్జెటును రాబోవు 30 వ తేదీ లోపుగానే పంపమని ప్రభుత్వంవారు వుత్తర్వులు పంపియున్నారు.

## ఎరుకల మహాసభ

ఈ నెల 22 వ తేది నరసరావుపేట తాలూకా ద్వితీయ ఎరుకల మహాసభ సంతమాగులూరులో ఆంధ్రరాష్ట్ర ఎరుకల మహాసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ రామేశ్వరం నాగయ్యగారి అధ్యక్షతన జరుగును. ఆంధ్రరాష్ట్ర ఎరుకల మహాసంఘ సంచాలకుడు శ్రీ పొన్నా కోటేశ్వరరావుగారు మహాసభను ప్రారంభిస్తారు. రాత్రి 9 గంటలకు "కబ్జుముడలె" అను బుర్రకథ చెప్పబడుతుంది. ఇంకా ప్రదర్శనలు కూడా వుంటాయి అని విజయవాడనుంచి రాష్ట్ర ఎరుకల మహాసంఘం కార్యదర్శి పాలపర్తి వీరయ్యగారు వ్రాస్తున్నారు.

## కీ॥ శే॥ గుడిపల్లి వీరయ్యగారు

చీరాల, నవంబరు 15: ఈ వూరి వాస్తవ్యుడు గుడిపల్లి వీరయ్యగారు (60 ఏండ్లు) కొంతకాలమునుండి పక్షవాత పీడితులై నిన్న సాయంకాలం వారిస్వగృహమున దివంగతులైనారు. వీరికి సంతానం లేదు. ఒక సోదరుడు కలడు. ఈయన 1921 లో జరిగిన చీరాలపేరాల మునిసిపల్ ఆందోళనలో కీ॥ శే॥ ఆంధ్రరత్న ఈ వ్యమంలో పాల్గొని మునిసిపల్ పన్ను నిరాకరించి కారాగారమునకు వెళ్ళెను. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనెను.

స్వ. వి.

# బొంబాయిలోని ఆంధ్ర పాఠశాల

## ప్రొ. విశ్వనాధ శాస్త్రి గారి సందర్శనం

బొంబాయి, నవంబరు 16:— నిజాము కాలేజీలో పండితులుగా ఉన్న ప్రొఫెసరు ఎస్. విశ్వనాధశాస్త్రి ఎం. ఎ. మాటుంగా (బొంబాయి) లో ఆంధ్రా ఎడ్యుకేషన్ సొసైటీవారు నడుపుతున్న పాఠశాలను సందర్శించి దీనిద్వారా సొసైటీవారు సాగించే అపారమైన సేవను కొనియాడారు. శ్రీ విశ్వనాధ శాస్త్రి గారు ప్రాచ్యపరిషత్తు వారి 15 వ సమావేశం సందర్భంలో ఇక్కడికి వచ్చిరి. సొసైటీయొక్క మేనేజింగుకమిటీ సభ్యులైన శ్రీ కె. సీతా వెంకట్రావు గారి అతిథులుగా ఉన్నారు. ఈ పాఠశాలకు తాము చేయగలిగిన సహాయం చేస్తామనీ, 200 పుస్తకాలకు తక్కువకాకుండా పిల్లలకు పంపుతామనీ శ్రీ శాస్త్రి గారు మాట ఇచ్చారు. ఈ పాఠశాలలో ప్రస్తుతం 203 మంది విద్యార్థులూ, 8 మంది ఉపాధ్యాయులూ ఉన్నారు. ఈ పాఠశాల నిర్వహణ కార్యంలో ఈ విధమైన సహాయం లభించినట్లయితే సొసైటీవారు కృతజ్ఞతతో స్వీకరిస్తారు.

# తిరుత్తని తాలూకాలో రైతుల దుస్థితి

తిరుత్తని, నవంబరు 15: అటు ఆంధ్ర కోస్తాజిల్లాలు గాలివానలతో నాశనమైపోతూవుంటే, ఇక్కడ తిరుత్తని తాలూకాలోని అనేక గ్రామాలలోని, మెట్టపైరులు మాత్రమే గాకుండా, మాగాణి భూములలోని వరిపైరులన్నిగూడా వర్షాభావమువలన ఎండిపోతూ ఉన్నవి. బియ్యమువగైరా ధాన్యముల ధరలుగూడా విపరీతముగా పెరిగిపోయి ప్రజలు బ్లాక్‌మార్కెట్టు బాధలు ననుభవించుచున్నారు. అన్ని సంవత్సరములవలె నీ యేడుగూడ వర్షాభావ మేర్పడినందున ప్రజలు పడుచుండెడి ఆవేదన మితిమీరిపోవుచున్నది.

(స్వ. వి.)

# రాయదుర్గం చేనేత పనివారి కడగండ్లు

రాయదుర్గం, నవంబరు 17: రాయదుర్గంలో 10000 చేనేత పారిశ్రామికులు మార్కెట్టు మందగించినదానివల్లనూ, చీరలుఖర్చు కాక కూలిగిట్టక పోవుటవల్లనూ, 2 నెలలగా చాలా బాధపడుచుండి, నూర్ల కొలది వలసవెళ్ళిరి. ఈనాడు వేరు శనగ, జొన్న చేనులకు వారు కూలీలుగా వెళ్లుతున్నారు. వారి కష్టాలు వర్ణనాతీతముగానున్నవి. రాత్రిపూట భిక్షాటన చేయుచున్నారు. యీ స్థితిలో ప్రభుత్వం సత్వరమే వారి బట్టలుతీసుకొనని యెడల ఆకలిచిచ్చుచే చావులు సంభవము కాగలవు.

స్వ. వి.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 18:

బంగారు – వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1–కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 77–4–0 పెట్లా బంగారు తులం 115–0–0 నూసబంగారు 113–8–0 సీమవెండి తులం 100–కి (రెడీ) 170–0–0 వెండి తులం 1 కి 1–12–0

వేరుసెనగ: (581 పౌ 1–కి ఎక్సు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది. 158–0–0 159 వేరుసెనగనూనె ఎక్సు వెల్లర్ (ఏవరేజి) నవంబరు అండ్ డెలివరి రు. 385 386 3 టు 5% యఫ్. యఫ్. ఎ.,

పంచదారనూనె (87 పౌన్లు గల పప్పు) ఒకటికి రు. 33–12–9, 33–0–9 పెనాంగు.

ఆముదం

కాండి 500 పౌనులుగలది రు. 295–0–0

పంచదార

ప్యారీ (2 అంకు) రు. 91–14–0

దక్కెర చిల్లరధర వీశ 1–కి 1. 5–0

# న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 17:

డిశంబరు 29.76 / 29.76 మార్చి 29.76 / 29.76 మే 29.70 / 29.71 జూలై 29.39 / 29.39 అక్టోబరు 27.98 / 27.99 డిశంబరు 27.90 / బిడ్ 27.91 అక్కర్ మార్చి 27.83 / బిడ్ 27.85 అక్కర్ మే 27.78 / బిడ్ 27.82 అక్కర్.

మిడ్లింగ్ హాజరు 30.26

డిశంబరు (గతవారం) 29.81

(గతవారం 29.76 వద్ద)

నోటీసు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

బెజవాడ కృష్ణా బ్రిడ్జిమీాద 1950 సం॥ లో సుంకములు వసూలుచేసు కొనుటకు టెండర్లు.

బెజవాడ కృష్ణా బ్రిడ్జిమీాద నున్న ... కాలిబాటలకు 1950 సం॥ లో సుంకములు వసూలుచేసుకొను హక్కులకు టెండర్లు, మద్రాసు ఎం అండ్ ఎస్ ఎం రైల్వే జనరల్ ఆఫీసులవద్ద, చీఫ్ ఆపరేటింగు సూపరింటెండెంటుగారి ఆఫీసులో 20-12-1949 మంగళవారము పగలు 12 గం. ల వరకు తీసుకొనబడును.

చీఫ్ ఆపరేటింగ్ సూపరింటెండెంటుగారి ఆఫీసులోను, బెజవాడలోని డిస్ట్రిక్టు ట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటు (ట్రాఫిక్) గారి ఆఫీసులోను, జాయింటు స్టేషన్ మాస్టర్ గారి ఆఫీసులోను, కంట్రాక్టు షరతులు, టెండరు ఫారములు కలిగిన నోటీసు పొందవచ్చును.

మద్రాసు 8
30-11-49. } పి. ఎ. ఎఫ్. కోరి,
చీఫ్ ఆపరేటింగ్ సూపరింటెండెంటు.

మరణము

**రా**జమండ్రి, మాడల్ హైస్కూలు నుండి హెడ్మాస్టరుగా రిటైరయిన శ్రీ తాడిపత్రి హనుమంతరావు, బి. ఏ. ఎల్. టి., ఎం. ఇ. ఎస్. గారు, ఈ నెల 11-వ తేదీన కర్నూలులో వీరి ఏకైక పుత్రుడు, శ్రీ టి. వి. సుబ్బారావు, అడ్వకేటుగారి గృహమున, 74 యేండ్ల పండిన వయసులో పరమపదించినారు. వీరి మృతికి, ముద్దుల భార్యలు, ఒక కుమారుడు ఒక కుమార్తె, అనేకమంది బంధువులు మిత్రులు విచారమున మునిగియున్నారు. సత్తెనపల్లి, మిషన్ హైస్కూలుకు శ్రీ టి. హనుమంతరావుగారు, మొట్టమొదటి హెడ్మాస్టరుగా నుండిరి. వీరు మద్రాసు విద్యాశాఖలో 35 యేండ్లు ఉద్యోగము చేసిరి. వివిధ గవర్నమెంటు హైస్కూళ్ళలో ఉద్యోగము చేసినంతకాలము హెడ్మాస్టరుగా మిక్కిలి ప్రజాదరణ పొందిరి. వీరి ఆత్మకుశాంతి కలుగుగాక.

## అతి మూత్రవ్యాధి
### ఏడు రోజులలో నిమ్మళించినది

ఎంత కఠినంగా దీర్ఘంగావున్న వ్యాధియైనా, వీనస్ చారంతో అతి మూత్ర వ్యాధిని పూర్తిగా కుదుర్చవచ్చును. ఇది నూతన శాస్త్ర పరిశోధన. ఈ వ్యాధి లక్షణాలు అతి దాహం, ఆకలి, మూత్రంలో పంచదార, దురద మొదలైనవి. వ్యాధిముదిరితే రాచపుండు, కురుపులు, కంటిపొర, యితర చిక్కులు సంభవించును. వీనస్ చారం వాడి వేలకు వేలమంది మృత్యు ముఖంనుండి బయటపడ్డారు. మరునాటికే అది చక్కెరను తొలగించి స్పెసిఫిక్ గ్రావిటి సమపరచును. రెండుమూడురోజుల్లో బాగ తేలికనిచ్చును. పథ్యంలేదు. వివరాలకు వ్రాయండి: ఖరీదు 50 బిళ్లల బుడ్డి రు 6-12-0 లు. పోస్టేజి లేదు. పెద్ద కెమిస్టు లందరివద్దను స్టోరులలోను దొరకును. లేదా మాకు వ్రాయండి.

వీనస్ రీసర్చి లేబరేటరీ (A.P.)
పోస్టు బాక్సు 587, కలకత్తా.

## వర్తకులకు హెచ్చరిక

పిల్లల ఆరోగ్యమునకు జె. డబ్ల్యు. డిపోన్ గ్రైప్ టానిక్ గుణమునకు పూచీ యని బిల్లుపైన వ్రాసి ఇవ్వవచ్చునని గుణమీయకపోయినవారికి డబ్బు వాపసుచేసి మానుండి వసూలు పొందవచ్చుననిన్నీ వర్తకు లందరికి హామీ ఇచ్చుచున్నాము.

వి. యస్. నారాయణ సన్సు,
H. O. కాకినాడ.
బ్రాంచీలు : విజయవాడ, విశాఖపట్నం, అనకాపల్లి, విజయనగరం.

KIRON
KIRON
THE BETTER LAMP

## కుష్ఠు * బొల్లి

వగైరా మేహపుమచ్చలు, సెగ, సవాయిగ్రంధులకు, గ్యారంటీ చికిత్స. క్యాటలాగు ఉచితం జి. వి. రెడ్డి, ప్రొప్రయిటర్సు, బి. రెడ్డి & కో (రిజిష్టర్డు) గోపాలపురం, సూ॥ గో॥ జిల్లా.

# ఆంధ్రరాష్ట్రనిర్మాణంపై వారంరోజుల్లోనే ఆర్డినెన్సు

## మద్రాసు రాజకీయవర్గాల భావన

చెన్నపట్నం, నవంబరు 17: అధికారం హస్తగతమైనప్పుడు ఆంధ్రరాష్ట్రమును నిర్మించెదమని ఆంధ్రనాయకులకు పురస్కరించుటకు గావించిన ప్రమాణమును, నిన్న ఆంధ్రరాష్ట్రం వెంటనే నిర్మించాలని కాంగ్రెసు వర్కింగుకమిటీ వారు తీర్మానించి, మాటమాటను నిలబెట్టినారని ఆంధ్రనాయకులు ఆనందాన్ని వెల్లడించుచున్నారు. భారతదేశం స్వరాజ్యమును పొందినను, భాషారాష్ట్ర విన్యాసముపై విరాజిల్లనివాడు అది పరరాజ్యతుల్యమే అనుననీ, దేశంలోని భిన్న సంప్రదాయాలు, సంస్కృతులు, కళలు పూర్ణత్వాన్ని పొందవలెనంటే భాషారాష్ట్రముల నిర్మాణంతప్ప గత్యంతరంలేదనీ, కాశ్మీరంనుంచీ, కన్యాకుమారి వరకు పాంచజన్యమును పూరించిన భాషారాష్ట్రజనకుడు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షులకు వరకూ ఈ గౌరవం ఆంధ్రులైనవారికి, తద్వారా ఆంధ్రజాతికి, దక్కటానికో అనునట్లు ఈ సమస్య తేలకుండా దైవము అపుచేసి వుంచినాడా అని ఆంధ్రులు ఆశ్చర్యపడుచున్నారు. ఆంధ్రులకు రాష్ట్రం కావలిస్తే ఆంధ్రులు పుచ్చుకొనరాదా అని భారతనాయకులు హాదించిననాడు ఆంధ్రులు భాషారాష్ట్రోద్యమంలో అగ్రగాములైనా మిగతా వారందరికీ భాషారాష్ట్రమువచ్చిన నాడే తృప్తిపడగలరని భాషారాష్ట్రవాదు లందరి తరఫున పనిచేస్తూవచ్చిన రాష్ట్రపతి నేడు నవ్యజీవి అని కేరళులు, కన్నడులు తమిళులూ జేజేలిడుచున్నారు. ఆంధ్రపత్రికను స్థాపించి, ఆంధ్రుల రాజకీయ, సాహిత్య, విజ్ఞానవీధుల తీర్చిదిద్ది ఆంధ్రోద్యమం దశదిశలలో విజృంభించుటకు, ఆంధ్రులలో "మాదీ ఒకజాతి,మాకు ఒకరాష్ట్రం కావలె"ఆనెడి దీప్తిని, ఆర్తిని కలుగజేసిన విశ్వదాత దేశోద్ధారక కళాప్రపూర్ణ నాగేశ్వరరాయని ఆత్మ, ఆంధ్రరాష్ట్రం, ఆంధ్రరాష్ట్రమని కలువరించి, అస్థి చర్మం వప్పగించి దివికేగిన భాషారాష్ట్ర పితామహులు దేశభక్తుని దివ్య ఆత్మ నేటితో శాశ్వతానందమును పొందగలదని ఒక ఆంధ్రనాయకుడు వచించినాడు. గోదావరీ, కృష్ణావేణి, పెన్నా, తుంగభద్రా మున్నగు పవిత్రతోయములతో, శ్రీశైలము, శ్రీపాదపురము, భద్రాద్రి మున్నగు దివ్యగిరులతో, ద్రాక్షారామాది పంచారామములతో, నాగార్జునకొండ, అమరావతి మున్నగు కళాఖండములతో 621 మైళ్ళ నిడివి, 220 వెడల్పు 67,000 చ॥ మైళ్ళ విస్తీర్ణంతో రెండు కోట్ల జనాభాతో, విలసిల్లు ఆంధ్రదేశము నకు నేటికొక రూపుగలిగి, అచిరకాలములోనే అది పరిపూర్ణ వికాసము నొంది, విశాలాంధ్రరాష్ట్రవతరణకు నాంది గా గలదని విశ్వసించుచున్నారు. ఆంధ్రుల కిది గర్వకారణమనీ, ఆంధ్రుల యశఃకాంతి దిగంత విశ్రాంతముసుటకు తగిన సమయము సన్నమైనదనీ ఆనందించుచున్నారు.

ఆంధ్ర, తమిళ ప్రభుత్వముల విభజనయు యూ భారతప్రభుత్వ చట్టం 290 సెక్షను క్రింద గవర్నరు జనరల్ ఉత్తర్వు ఒక వారంలో రాగలదని రాజకీయవర్గములవారు తెలుపుచున్నారు. ఆంధ్ర సెక్రటేరియట్, ఆంధ్ర హైకోర్టులు ఫలాని ఫలాని స్థలములందు ఉంచవగలననియు, సామాన్య ఎన్నికలు జరుగునాటికి ఆంధ్రరాష్ట్రము పరిపూర్ణముగా పనిచేయుగలదనియూ రాజకీయ వర్గములవారు తెలుపుచున్నారు.

### మంత్రుల హర్షం

మద్రాసు ప్రధాని కుమారస్వామి రాజాగారు "ఆంధ్రులు విడిపోతున్నందుకు సంతోషమునియు, వర్కింగు కమిటీ వారి నిర్ణయము తమకు హృదయానందకారకమైనదనియు ఆంధ్రులకు భగవంతుడు తోడ్పడుగాక" అనియు తెలిపిరి. భక్తవత్సలంగారు "ఇది పట్టాభి విజయం. పట్టాభిగారు రాష్ట్రపతి అయి భాషారాష్ట్ర నిర్మాణమునకు మూలకందమై, వారి పదవికి అనురభ్యాతి సాధించినారు. ఆంధ్రుల చిరకాలవాంఛ నేటికి ఫలించుట సంతోషము" అని చెప్పిరి. ఉద్యోగమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు "ఇక ఆంధ్రరాష్ట్ర నిర్మాణపూర్వ తతంగమెంలో జరుగవలసి యున్నది. తొందరపడకుండా, నిదానముగా ఈ వ్యవహారము జరుగవలెనని యున్నది" అని తెలిపిరి "రాష్ట్రకాంగ్రెసు మద్రాసు ప్రభుత్వ తీర్మానములకు అనుగుణముగా వర్కింగు కమిటీవారి తీర్మానం ఉండుటకు సంతోషము కావలెను" అని తెలిపినట్లు మంత్రి సీతారామరెడ్డిగారు తెలిపిరి. సహకార మంత్రి చంద్రమౌళిగారు వర్కింగు కమిటీవారి నిర్ణయం సర్వాంధ్రులకు ఆనందదాయకముగ నున్నదనిరి. ఆంధ్రులు, తమిళులు స్నేహితులుగా, విడిపోవటం ముదావహమని తెలిపిరి.

### రాజధాని అన్వేషణకు పూనుకోవాలి

మద్యనిషేధమంత్రి గౌ. నీలం సంజీవరెడ్డిగారు ఇటుల తెలుపుచున్నారు :

రాష్ట్రము విభజన అవటం ఎట్లాగో నిశ్చయింప బడినది గాబట్టి ఎంత శీఘ్రంగా విభజన జరిగితే అందరికీ మంచిది. మద్రాసు మనది కావని, తెలిసినాక గూడా ఆంధ్ర ప్రభుత్వం మద్రాసులోనే ఉండటం అంత సమ్మతం గాదు. కాబట్టి త్వరలో ప్రత్యేకరాజధాని అన్వేషణలో నిమగ్నులంకావడం ఉత్తమం. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం తీర్మానం మేరకు శ్రీబాగ్ ఒప్పందం వరకుల నమసరించి రాజధాని హైకోర్టుల నిర్ణయంలో రాయలసీమవారి అభిప్రాయాన్ని మన్నిస్తారని నమ్ముచున్నాను. ఆర్థికంగా ఆంధ్రరాష్ట్రంలోటు ఉన్నా త్వరలోనే దాన్ని భర్తీచేసుకొనే మార్గాలు ఆలోచించుకొని అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించవలెనని నమ్ముచున్నాను. మొదట ఇల్లు చక్కబెట్టుకోడానికి కొంత కాలం పడుతుంది. ప్రజాసహకారం, పట్టుదలాఉంటే ఇవన్నీ సాధించలేనివి కాదు. రాష్ట్రంలో ఆంధ్రుల గౌరవ ప్రతిష్ఠలు భారతావనిలో ఇనుమడింపగలవు. రాష్ట్ర అభివృద్ధికి అందరమూ దీక్షతో పనిచేయవలెనని కోరుచున్నాను."

### కాళేశ్వరరావుగారి ప్రకటన

మదరాసు, నవంబర్ 17 : శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఈ క్రింది ప్రకటనచేసిరి.

మదరాసు నగరవిషయమై తర్జనభర్జనల మన్య కొన్ని ప్రధానఅంశములు మరచిపోవుచున్నారు. ఇండియాప్రభుత్వము ప్రజలు ముఖ్యముగా స్మరించవలసినవి కొన్నియున్నవి. కొత్తగ నేర్పడనున్న ఆంధ్రరాష్ట్రమునకు ప్రస్తుతపు రెండు శాసనసభాసభ్యులతో కూడిన ఒకేసభ వుండవలెను. ఆంధ్రజిల్లాలు, మదరాసు నగరమునుండి ఎన్నుకోబడిన యం. యల్. ఎ., యం. యల్. సిలను నూతన ఆంధ్రరాష్ట్ర శాసనసభ్యులుగా గవర్నరు జనరలు నామినేటు చేయవలెను.

ప్రస్తుతము మదిరాసు నగరములోని ఆంధ్రశాసనసభ్యులు ఎవరైనా తమిళనాడుకుగాని, మదరాసునగర రాష్ట్రమునకుగాని వెళ్ళదలచిన అట్లువెళ్లుటకు అవకాశమివ్వవలెను. నామినేషనులు చేసిన యెడల మురాశశ్యమునకు, స్వజనపక్షపాతమునకు అవకాశమువచ్చును. గాన గవర్నరు జనరలు కొత్త ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీకి అదనముగా నామినేషనులు ఏవియూ చేయకూడదు. గవర్నరు జనరలు వెంటనే ఉత్తర్వుద్వారా ఆంధ్రరాష్ట్రము నేర్పరచవలెను. ఆంధ్రరాష్ట్రము నూతనరాజ్యాంగమును ఆమోదించబడేలోగా స్వరూపమునుపొంది పనిచేయుచుండవలెను.

రాజ్యాంగచట్టము జనవరి 26 వ అమలులోనికి వచ్చినతరువాత ప్రస్తుతపు ఓటర్లతోనే ఆంధ్రరాష్ట్ర శాసనసభ బలగమును పెంచి కొత్తరాజ్యాంగముక్రింద ఏప్రిల్ మే నెలలలో ఎన్నికలు జరుపవలెను. అప్పుడుగాని ఆంధ్రశాసనసభ మంత్రివర్గములలో ప్రజాప్రాతినిధ్యము ఏర్పడును.

ఇట్లు నూతనముగా ఎన్నుకొనబడిన శాసనసభ సమావేశమయిన శాసనసభ ఏర్పడువరకు రెండుమూడు సంవత్సరముల వరకు ఉండవచ్చును. ఆంధ్రప్రజల న్యాయము జరుగవలెనన్న ఆంధ్రపరిపాలనకు సంబంధించిన ఈ విషయము అతిప్రధానము. ఈ విషయమును జాగ్రత్తగా పరిశీలించి న్యాయంచేకూర్చవలెనని గవర్నరు జనరలుకు విజ్ఞప్తి చేయుచున్నాను.

ఆంధ్రరాజధానిని కొన్నిసంవత్సరములవరకు మదరాసునుండి కదల్చకూడదు. అవసరమైతే ఈ గవర్నర్ రెండు రాష్ట్రములకూ గవర్నరుగా వుండవచ్చును.

### ఎం. కె. వి. రెడ్డిగారి ప్రకటన

మద్రాసు నవంబరు 17 : రాయలసీమ మహాజన సభాధ్యక్షులు, యం. కే. వి. రెడ్డిగారిట్లు వ్రాస్తున్నారు.

"ఆంధ్రరాష్ట్ర నిర్మాణం తక్షణమయినదని నిన్న సాయంకాలం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆమోదించిన తీర్మానము నిష్పక్షపాతమైనది, సంతోషము కూర్చగలదనుట నిర్వివాదం. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము సత్వరం అవతరించు మార్గమునకు ముందు చేసిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని, తమిళనాడు కాంగ్రెస్ సంఘాన్ని, మద్రాసు ప్రభుత్వాన్ని రాయలసీమ మహాజన సభ తరఫున, అభినందిస్తున్నాను. అంతేకాకుండా, ఆంధ్రుల ఆందోళనను, చిరవాంఛితాన్ని గుర్తించి రాజనీతిజ్ఞతతో రాష్ట్రము నిర్మాణానికి అంగీకరించిన సర్దార్ పటేల్, పండిట్ నెహ్రూ మొదలగు అగ్రనాయకులందరికి కూడా కృతజ్ఞతను తెలియపరచుచున్నాను. ఈసందర్భములో రాష్ట్రపతి పట్టాభి, ప్రకాశంపంతులు, రంగా కాంగ్రెస్ కార్యవర్గి కళా వెంకట్రావుగార్ల కృషి ప్రత్యేకంగా ఆంధ్రజాతి శాశ్వత కృతజ్ఞతకు పాత్రమయినది.

రాయలసీమ అభివృద్ధికి సర్వవిధాలా కృషిచేయగలమని, శ్రీ బాగ్ ఒడంబడికను అనులంఘనపగలమని హామీ యిస్తూ రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానించడముకలన కోస్తా మిత్రులనుసరించి రాయలసీమ ప్రజలకు ఉన్న అనుమానాలు, పూర్తిగా సమసిపోయాయని చెప్పటానికి సంతోషిస్తున్నాను.

ఇక యిప్పుడు రాజధాని హైకోర్టు వగైరా అనేక ప్రధానసమస్యలు ఉత్పన్నమవుతున్నవి. వీటినిగురించి అందరితో సంప్రతించి, అందరికి అనుకూలముగా యుండేటట్లు తగు నిర్ణయాలు చేయవలసిన అవసరం. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రముకుం చే రాయలసీమతోసహా చేరిన రాష్ట్రమే కాని అన్యంకాదు. అందుచేత యిదివరలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయమై, రాయలసీమ ప్రజలలో యెట్టి సందేహాలు, అభిప్రాయభేదాలు వున్నా, రాష్ట్రము రానున్న యీతరుణంలో రాయలసీమ అభివృద్ధి విషయమై యెవ్వరికీ, యెట్టి అభిప్రాయభేదాలు వుండడానికి వీలులేదు. కనుక రాయలసీమను రత్నాల సీమగా మార్చడానికి యికనుంచి జరుగనున్న కృషిలో మనస్ఫూర్తిగా సహకరించవలసినదని, అన్ని వర్గాలవారికి విజ్ఞప్తిచేస్తున్నాను.

భవిష్యత్తులో రాయలసీమ అభివృద్ధికి సంబంధించి, మొన్న 11 వ తేదీన రాష్ట్ర కాంగ్రెస్ ఆమోదించిన తీర్మానం ప్రాతిపదికగా, యేకగ్రీవమైన ఒక ప్రణాళికను తయారుచేయడానికి, రాయలసీమ మహాజనసభ, సర్వసభ్యసమావేశం, త్వరలో జరుగనున్నది. దానిలో పాల్గొని మాతో సహకరించవలసిందని, శాసనసభలోని రాయలసీమ ప్రతినిధులకు మంత్రులకు వివిధ వర్గాలకు చెందిన ఇతర మిత్రులకు విజ్ఞప్తి చేస్తున్నాను."

### నిజలింగప్ప హర్షం

న్యూఢిల్లీ, నవంబర్ 17: రాష్ట్రసిద్ధి పొందిన ఆంధ్రప్రజలను అభినందించుచూ, కర్ణాటక కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు ఇలా ప్రకటించారు.

'రాష్ట్రాన్ని సంపాదించుకో గలిగినందుకు ఆంధ్రప్రజలను హృదయపూర్వంగా అభినందించుకున్నాను. దీనితో, కాంగ్రెస్ అగ్రనాయకులు భాషారాష్ట్ర నిర్మాణానికి విముఖులుగా వున్నారని దక్షిణాదిని వున్న అపోహ ఒకటి తీరిపోయింది. ఆంధ్రరాష్ట్రనిర్మాణ నిర్ణయం, కర్ణాటకరాష్ట్ర నిర్మాణానికి నాందిగా నేను భావించుచున్నాను. కర్ణాటకప్రజలు ప్రస్తుతం మూడు పరిపాలనలక్రింద పడుతున్నారు. మైసూరులోనూ ఇతరత్రానూ వున్న కన్నడు లెవ్వరూ ఇక నిరుత్సాహపడవలసిన పనిలేదు. ఐక్యతలోనూ, శాంతిలోనూ, నాయకత్రయ నివేదికలో సూచింపబడిన పరిస్థితులను చెందెందజేయటానికి తీవ్రంగా కృషిచేయాలని హెచ్చరించుకున్నాను. ఇప్పుడు కాలం వృధాపుచ్చి లాభంలేదు. మైసూరువారు, ఇతరత్రా వున్న కన్నడులు యీనుమ్మంది దీనికోసం, శ్రీఘ్ర పరిణించగలరని ఆశించుకున్నాను.

ఈలోగా. ఆంధ్రనాయకులు బళ్ళారిలోని మూడు తాలూకాల విషయములోనూ, సరిహద్దులోని యితర ప్రాంతాల విషయంలోనూ, సరిహద్దు సంఘంవారి నిర్ణయం తేలేవరకూ, కర్ణాటక ప్రజలకు నష్టదాయకంగా ఎట్టి కార్యకలాపాలకూ పూనుకోరని విశ్వసించుకున్నాను. నాకు వారంతా తెలుసు, వారి సహృదయత్వములో నాకు విశ్వాసం వుంది.'

### రాయలసీమకు ఆనందకారణం

గోనుగుంట్ల వెంకటరెడ్డి (ఎం. ఎల్. ఎ) గారు ఇటుల తెలుపుచున్నారు: ఆంధ్రరాష్ట్రసిద్ధికి రాయలసీమలో కొంతవరకు వ్యతిరేకాభిప్రాయం వుండినా సత్వరసిద్ధికై పాటుపడిన నాయకులు మహోజ్వలికిద సంతోషదాయకముగా వున్నది. రాయలసీమ అభివృద్ధి విషయము కోస్తా జిల్లాలవారు ప్రత్యేక శ్రద్ధనుచూపి అధికంగాను పాత్రలికంగాను ఆశీర్వదించేస్తారని భావిస్తాను. ప్రత్యేక రాజధాని విషయములో అందరూ శ్రీబాగ్ ఒడంబడికనే అనుసరించి పోతారని నమ్ముచున్నాను. మన వాంఛ నెరవేరిందని ఆంధ్రరాజ్యం సుస్థిరంగాను, సుశిక్షితముగాను భారతదేశంలో పేరుపొందునని ఆశిస్తాను. ఆర్థికంగా వెనుకబడిన రాయలసీమ, ఒక సమానత్వమునకు తెచ్చుట ఆంధ్రుల విధ్యుక్తధర్మమని గుర్తించాలని మనవిచేయుచున్నాను.

## రాష్ట్రపతి పట్టాభిగారికి జోహార్లు

మద్రాసు, నవంబరు 17: పండిట్ సుసర్ల బ్రహ్మదేవశాస్త్రిగారిట్లువ్రాస్తున్నారు.

గత 36 ఏండ్లుగ ప్రత్యేక రాష్ట్రం కొరకు ఆంధ్రులుచేస్తున్న కృషి నేటికి ఫలించింది.

మన డా॥ పట్టాభిగారు రాష్ట్రపతియగుట తోడనే మన ఆంధ్రరాష్ట్రం సిద్ధించుట లక్ష్యమని నమ్మిన, ఆంధ్రుల చిరకాలవాంఛ జయప్రదమైనందులకు, ఆంధ్రులు తరతరాలవారు పట్టాభిగారి మేధాచతురతా నిర్వహణకై సర్వదా కృతజ్ఞులయి జోహారు లర్పించగలరు.

రాష్ట్రసిద్ధికొరకు ప్రముఖపాత్రవహించి కృషిచేసిన భారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావుగారి నైపుణ్య విశేషము నకూ ఆంధ్రప్రజ హర్షాతిరేకముతో ధన్యవాదము లర్పించుచున్నారు.

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు, ఆంధ్రమహాసభాస్థాపకులలో నొకరై, వయోవృద్ధులయ్యు నవయవ్వన దివ్యమూర్తివలె ఆంధ్రకాంగ్రెసు సభావేదికపై సర్వజనాంగీకార తీర్మానము ప్రవేశపెట్టి ఏకగ్రీవముగా అంగీకరింపజేసినందులకు ఆయన ఓపికకు దీర్ఘవిశాలదృష్టికి ఆంధ్రజాతి ప్రణామము లర్పించుచున్నది. ఆంధ్రకాంగ్రెసుకు రంగాగారు అధ్యక్షులుగా నుండగా ఇట్టి మహత్తర సంఘటన జరిగినందుకు వారి నభినందించుచున్నాము.

### "విశాలాంధ్ర" సంపాదక వెన్నెలకంటి రాఘవయ్యగారి హర్షం

నెల్లూరు, నవంబరు 15 : శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు ఎం. ఎల్. ఏ. ఆంధ్రరాష్ట్రమును గూర్చి ఈ క్రింది అభిప్రాయము తెలిపిరి.

ఆంధ్రరాష్ట్రమును గురించి రాష్ట్ర కాంగ్రెసు చేసిన తీర్మానము సముచితముగా యున్నది. దీనివల్ల కొందరు ఓడిపోయినారని గాని కొందరు గెలిచినారని గాని అనుకొనపనిలేదు. వివాదగ్రస్తమైన భాగములను పెద్దమనుష్యుల తీర్పునకు వదలిపెట్టి, తగాదా లేని భాగాలతో రాష్ట్రము ఏర్పరుచుట న్యాయమైన పని యని భారత వర్కింగు కమిటీ మొదటినుండి చెప్పుచున్నది. మదరాసు పట్టణము గురించి ప్రారంభములో అంతపట్టుపట్టి, యుండకపోతే, అరవలు తెలుగువారిని తూలనాడుటకు, వారిని హాస్యాస్పదులనుగా చేయుటకు అవకాశము యుండెడిది కాదు. అంతేకాక, తెలుగు నాయకులలో యిన్ని శీలికలు కలిగి పదిమందిలో నగుబాట్ల పాలై వుండేవారు కారు. యింత పెద్ద తుపాను విపత్తుసంభవించినపుడు కూడా అరవమంత్రులు యింత అలసభావముతో మన కష్టములను త్రోసిపుచ్చుటయే తక్షణ ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకతను నిరూపించుచున్నది. పట్టాభి ప్రకాశం పంతులు గార్లు ఇంతకాలమునుండియైన ఒక త్రాటిమీద నడిచి తెనుగు దేశానికి గొప్ప గౌరవము తేగలరని నమ్ముచున్నాను.

### బళ్లారిజిల్లా కన్నడ నాయకుని అభిప్రాయం

ఆదోని, నవంబరు 16 : శేల్కారు తీర్పుప్రకారం బళ్లారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలు ఆంధ్రరాష్ట్రంలోనే చేరవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు చేసిన తీర్మానము ఖండిస్తూ, ఆంధ్ర కాంగ్రెసువారు శేల్కారు తీర్పును సరిగా అర్థంచేసుకోలేదనీ, ఆ తీర్పు ప్రకారం పైమూడు తాలూకాలపై ఆంధ్రులకెట్టి హక్కు లేదని బళ్లారిజిల్లా కర్ణాటక ఏకీకరణ సమితి అధ్యక్షుడు వ్రాస్తున్నారు.

తెలుగురాష్ట్రం బళ్ళారి జిల్లా లేక పోయినా విశాలము, బలీయముగానే వుంటుందనీ, అజిల్లా పోయినంత మాత్రంలో వారికి కలిగేనష్టం ఏమీ వుండదనీ, డా॥ పట్టాభిగారుకూడా 1931 లో కేంద్ర కర్ణాటక ఏకీకరణ సమితికి (ధార్వార్) అధ్యక్షుడుగా వుంటూ బళ్ళారిజిల్లా యావత్తూ కన్నడులదేనని గవర్నరు జనరలుకు వ్రాశారనీ, కనుక కేంద్ర ప్రభుత్వము, కాంగ్రెసు కార్యవర్గము బళ్ళారిని ఆంధ్రలో చేర్చరాదని ఆయన అంటున్నారు.

అనంతపురం, కర్నూలు జిల్లాల్లో కన్నడులకు గల హక్కులనుకూడా గుర్తించి తరువాతమాత్రమే ఆంధ్రరాష్ట్రమును నిర్మించాలని ఆయన కోరుతున్నారు.

### తుపాను సహాయ విరాళాలు

బందరు, నవంబర్ 16 :

రాష్ట్ర రెవిన్యూ కృష్ణాజిల్లా శాఖవారి కార్యవర్గ సభ నిన్న సాయంకాలము స్థానిక పురపాలక భవనములో జరిగినది. హుమాయూన్ సాహెబుగారి అధ్యక్షతన జరిగెను. ఈ సంఘమువారు తుపాను బాధితుల సహాయార్థము రూ 1000/-లు విరాళము జిల్లాకలెక్టరుకు మంజూరు చేసిరి.

నోటీసు

కడప డిస్ట్రిక్టు మునసఫ్ కోర్టులో
1949 సం॥ రం ఇ. పి. నెం. 312 రు.
యస్. సి. నెం 229 of 1948.

వాది:-వీటూరు నరసయ్య & సుబ్బయ్యశెట్టి పార్ట్నర్ వీటూరు సుబ్బయ్యశెట్టి సాకిన్ కడపటవున్.

ప్రతివాది:-కొవలూరు నాగయ్య సాకిన్ కమలాపురం గ్రామం.

**వా**ది పైనెంబరులో ప్రతివాదిపైన పొందిన డిక్రీబాకి క్రింద షెడ్యూలు దాఖలా ప్రతివాది తాలూకు ఆస్తిని యీలముకకు తెప్పియున్నాడు. సదరు ఆమలు మనివిలో సేల్ నోటీసుకై 1-12-1949 దికి వాయిదాయున్నది. ఆ వాయిదానాటికి ప్రతివాది హాజరై తన అక్షేపణ తెలుపుకొనని యెడల ప్రతివాదిని ఎక్సపార్టీ గా డిక్లేర్ చేసి సదరు ఆస్తిని యీలంవేయబడునని తెలుపడమైనది.

షెడ్యూలు : కడప డిస్ట్రిక్టు, కమలాపురం సబ్ డి॥ లో చేరిన కమలాపురం తాలూకా కమలాపురం గ్రామంలోని జమీానులకు నెంబరువారి వివరము :

1. సర్వే రు 63 నెం. 318/2
   య 1.3 సెంట్లు 8-2-0 లు ½ భాగం
   య 0.26 సెంట్లు మాత్రమే.
2. సర్వే రు 63 నెం. 319/2
   య 0.63 సెంట్లు 4-15-0 ల పైకి ½ భాగం
   య 0.31 సెంట్లు మాత్రమే.
3. సదరు గ్రామములోని కొవమునకు చెందు బంది వివరం:-

డోర్ నెం. 6/63 రు తూర్పు : ఆగేపాటి వెంకటసుబ్బయ్య కొతము, పడమర : రస్తా, దక్షిణం : శిరిగిరి సుబ్బమ్మ కొతం, ఉత్తరం : భావిరస్తా, యీ మధ్య రెండు చదరపు అంకణముల కొతము, నైకప్పు, అడుగు జాగా దేభిలు :

కడప, 12-11-49. | టి. రాధాకృష్ణయ్య, వాది అడ్వకేటు.

నోటీసు

మద్రాసు స్మాల్ కాజ్ కోర్టు
దావా నెం. 4653 ఆఫ్ 1949.
వాది ; షావైజాపల్ జాట్ మల్.
ప్రతివాది : అద్దేపల్లి రామకోటేశ్వరరావు.

**పై** దావా రు 277-6-0 ఖర్చులతో రాబట్టుకొనుటకు తేదీ 2 వ కోర్టుగారి యెదుట 30-11-49 ఉ. 10-30 గంటలకు విచారణకు వాయిదా వేయబడినది. ఆరోజు ప్రతివాది హాజరుకానిచో అతని పరోక్షమున దావా విచారింపబడును.

రామానుజం & వెంకటశేషయ్య, వాదితరపు అడ్వకేట్లు.

అమ్మకము

**సు**గర్ కేన్ క్రషర్సు (పవరుతోను, ఎద్లతోను ఆడించవచ్చును.) ఎలెక్ట్రిక్ మోటార్లు, డబ్లివు. ఐ. & సి. ఐ. పుల్లీలు, వివిధరకములు బెల్టింగులు, గ్రీస్ వాల్వులు, పిండిమరలు, విడిభాగములు, వివిధ తయారీల పంపులు, స్టార్టర్లు మొదలైనవి స్టాకులనుండి వెంటనే దొరకును. మీకు కావలసిన అవసరములకు దిగువ అడ్రసుకు వ్రాయండి.

పి. గోవిందరాజ్ అండ్ సన్సు లి॥
380, తంబుచెట్టివీధి, మద్రాసు.

... మెషినరీ అమ్మకము

'నేషనల్' ఆయిల్ యింజన్ 22 హెచ్. పి. 'OB' టైప్, హారిజాంటల్ కోల్డుస్టార్టు, 375 rpm, డబుల్ ఫ్లైవీల్ బ్రాండ్ క్రొత్తది సీలు ప్యాకింగులోనున్నది, వెంటనే డెలివరీ చేయబడును. ఎస్. ఎస్. యూనియన్ పవర్ 'Diahatsu' స్టీమరులో క్రూడ్ ఆయిల్ యింజనులు, హారిజాంటల్, కోల్డుస్టార్టు, 9, 12, 15 హెచ్. పి. గలవి వచ్చుచున్నవి. మిగిలిన వివరములకు దిగువ అడ్రెసుకు వ్రాసి తెలిసికొనవచ్చును.

పి. గోవిందరాజ్ అండు సన్సు, లి॥
380, తంబుచెట్టి వీధి, మద్రాసు.

ఉబ్బసం మందు

చిత్రకోట కామద్ కొండమూలికను 5-12-49 తేదీ పౌర్ణమినాడు వాడితే ఒక్క మోతాదుతో ఉబ్బసం నయమవుతుంది. జాబులు యింగ్లీషులో వ్రాయవలెను,

MAHATMA TAPSI BABA.
Ramgufa, P. O. Chitrakot (Banda) U. P.

మదరాసు రేసులు
1949-50
నవంబర్ మీాటింగు

| | |
|---|---|
| ఆదివారము | 20-11-1949 |
| ఆదివారము | 27-11-1949 |

"ది రేస్ క్లబ్ కప్"

డక్ బాక్
భారతదేశమున అభిమానపాత్రమైన వానకోటు
బెంగాల్ వాటర్ ప్రూఫ్ వర్క్సు (1940) లిమిటెడ్
కలకత్తా, బొంబాయి, నాగపూర్
హెడ్డాఫీసు :
28 థియేటర్ రోడు, కలకత్తా.

GOVERNMENT OF INDIA
DISPOSALS
టెండరు నోటీసు

అవడి, 200 డి. ఓ. డి. వద్ద నున్న ఎలెక్ట్రికల్ సామానులు, నాన్-స్టాండర్డు మెషీను పనిముట్లు, జెనరేటింగ్ సెట్లు, బ్యాటరీలు, వైర్ లెస్ ఎక్విప్‌మెంటు, (వివరములు జాబితా టెండరు ఫారములతో జతపరుపబడినది) కొని తీసుకొనిపోవుటకు, డబుల్ కవర్లలో సీలుచేసిన టెండర్లు కోరబడుచున్నవి.

టెండరు మీాద వ్రాయవలసినది :

Tender No. RCM/Collection 69/MA—3.
టెండర్లు పంపవలసిన ఆఖరు తేది 1-12-49 సా. 3 గంటలు
టెండర్లు బహిరంగముగా తెరచుట 2-12-49 సా. 4 గంటలు
అంగీకారమునకు అవస్థ తెరచియుంచవలసిన గడువు 3-1-1950 వరకు

ధరావతు సొమ్ము : టెండరు మొత్తమునకు 10% తక్కువ కాని ధరావతు సొమ్ము యింపీరియల్ బ్యాంకులో గాని, రిజర్వు బ్యాంకులో గాని, గవర్నమెంటు ట్రెజరీలో గాని, డిపాజిటుచేసి, సదరు చలానా లేదా రశీదును టెండరుతో జతపరచి పంపవలెను. బ్యాంకు డ్రాఫ్టుగాని చెక్కుగాని అంగీకరింపబడవు.

ఫారం Con. 117 లోని నియమ నిబంధనలకు లోబడి అమ్మకములు జరుగును. సదరు ఫారము డిస్పోజల్సు ఆఫీసు లన్నిటిలోను దొరకును.

రు 5/-లు రొక్కము చెల్లించి, రీజియనల్ కమీషనర్ (డిస్పోజల్సు) మద్రాసు నుండి, టెండరు డాక్యుమెంట్ల పూర్తి సెట్లు పొందవచ్చును. టెండరు ఒకటి వాపసు చేయబడదు. టెండరు ఫారము ఒకరిది మరియొకరికి మార్చుకొనగూడదు.

ప్రకటించినది
రీజియనల్ కమీషనర్ (డిస్పోజల్సు)
యునైటెడ్ యిండియా లైఫ్ బిల్డింగు, ఎస్ప్లనేడ్, మద్రాసు
AC/RCDM/87

Call of Youth

పొటెన్సాన్ యుద్ధానంతరం కనిపెట్టబడిన ఒక దివ్యౌషధం, లక్షలాది ప్రజలకు జీవం పోసింది. ఇది ఇంగ్లండులో ఉన్న అమెరికన్ శాస్త్రవేత్తలచే తయారు చేయబడింది. నరాల దౌర్బల్యానికీ, ధాతులోపానికీ అమోఘమయింది. కొద్ది బిళ్లలు సేవించిన తక్షణమే గుణం కనిపిస్తుంది. దీన్ని సంపాదించడం మీరు అదృష్టంగా పరిగణించవగలరు. ఇంగ్లండులో యుద్ధం నుంచి తిరిగివచ్చిన లక్షలకొలది ప్రజలు, కోలుపోయిన తమ జవసత్వాలను తిరిగి ప్రసాదించిన పొటెన్సాన్‌కు కృతజ్ఞులై యున్నారు.

POTENSAN

FOR LASTING ENERGY & RADIANT YOUTH

KAR & CO.,
2, Thambu Chetty St., Madras 1.

PRICE Rs. 4-14-0 PER BOX
PER V.P. Rs. 5-5-0 PER BOX



శుభ్రమైన చలువ...

ఏదంటే OK చలువే!

L. T. ఓ.కె. సబ్బు



శ్రేష్ఠమైన బిస్కట్లు బ్రిటానియా

శ్రేష్ఠమైన బిస్కత్తులే బ్రిటానియా

BB-67



కోతలు, గాయములు చర్మ వ్యాధులకు

క్యుటికూరా కావాలి

క్షేమంగా వుంచడంకోసం ప్రతిచర్మ వ్యాధికి క్యుటికూరా ఆయింటుమెంటు వాడండి. దాని శమనపరిచే విషనివారక స్పర్శ, మంటను తగ్గిస్తూ, చర్మమును చక్కపరచును.

క్యుటికూరా ఆయింటుమెంటు

CUTICURA OINTMENT



పవెల్సువారి అంగవైకల్యపు పరికరాలు

అంగవైకల్యం సరిచేసే పరికరాలు, మాయ అవయవాలు, ఉపయోగానికి సరుకాలు, బెల్టులు మావద్ద తయారవుతవి. నిపుణులైన యూరోపియన్ స్పెషలిస్టు ఎప్పుడు హాజరుగా వుంటాడు.

పవెల్సు లిమిటెడ్, బొంబాయి 4.

POWELLS LIMITED.
BOMBAY, No. 4.


Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.

# కొల్లేటి గ్రామరైతు మహాసభ తీర్మానాలు

## ప్రజలనుకరువు ప్రమాదం నుంచి తప్పించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి

మదరాసు, నవంబరు 15 : అవనిగొలను గ్రామంలో 6-11-49 వ తేదీనాడు జరిగిన పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం రివిన్యూ డివిజన్ కొల్లేటి గ్రామరైతు మహాజనసభలో శ్రీ విదమర్తి అశ్వినీకుమార దత్తు గారి అధ్యక్షతను ఈ దిగువతీర్మానాలు చేయబడినవి.

అక్టోబరు 27, 28 వ తేదీలలో వచ్చిన ప్రళయ సదృశమైన తుపాను, తత్ఫలితముగా కలిగిన ఉప్పుటేరు వరదలు కొల్లేటి గ్రామాలన్నిటిని ముంచివేసినవి. ఇండ్లు పశువులు, సస్యములు విపరీతముగా నష్టపడినవి. ఈ తుపాను వరదలవలన నష్టపడని ప్రజలు ఒక్కరూ యీ గ్రామాలలో కాన్పించరు. తుపాను, వరద బాధితులైన ప్రజలకు ప్రభుత్వము ప్రజలూ చేయవలసిన సహాయ మపారము. ప్రభుత్వంవారు యీదిగువ అంశములలో తక్షణ సహాయంచేసి ప్రజలను కరువు పరిస్థితుల నుండి రక్షింప కోరుచున్నాము.

1. వరదలవలన కలిగిన ముళకమూలంగా రెండవ పంటకు కావలసిన నల్లఆర్లు తెల్ల ఆర్లు, గరికలు మున్నగు పిదపవైరులకు ఉపయోగించు విత్తనములను, మెట్టప్రాంతములనుంచి, ప్రభుత్వ వ్యవసాయశాఖ డిపోలనుండి తక్షణమే సప్లయి చేయించవలెను. 1360 వ ఫసలీ ప్రథమ పంటకు కావలసిన యావత్తు ప్రశస్తమైన విత్తనములను రాష్ట్రమునుండిగాని, రాష్ట్రేతర ప్రాంతములనుండి గాని తెప్పించి, నిలవచేసి రైతులకు అమ్మించ వలయును.

2. దాళ్వసాగుకు కావలసిన ఎరువు అమ్మోనియం సల్ఫేటు, ఆముదపుపిండి, వేరుశనగపిండి వగైరాలు వ్యవసాయపు డిపార్టుమెంటుద్వారా సకాలంలో అనగా డిసెంబరు నెలలోనే సప్లయి చేయించవలెను.

ప్రభుత్వంవారును, పెద్దరాష్ట్ర బాంకులును, రైతులకు 5 సంవత్సరముల పరిమితిలో 5 సమాన సంవత్సర వాయిదాలలో తీర్పుకొను పద్ధతిని ఋణములను నవంబరు మాసాంతమువరకే రాష్ట్ర ప్రభుత్వమువారు యిప్పించవలెను.

4. మా కొల్లేటి గ్రామాల్లో యావత్తు సార్వాపంటయున్నూ పూర్తిగా నాశనమైనందున, రైతులు యావన్మందిన్నీ సంపూర్ణంగా రెండవపంటమీదనే ఆధారపడవలసివున్నందున జనవరి మాసంనుంచి ఏప్రిల్ నెలాఖరువరకున్నూ పెర్మనెంటు జోను భూములకు నీటిని పూరా సప్లయి చేయించ వలసిందిగా, చీఫ్ యింజనీరు, సూపరింటెండింగు ఇంజనీరు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగార్లను శీఘ్రంగా కోరుచున్నాము.

5. 1949 వ సంవత్సరమునుండి డిసెంబరు నెలాఖరులోగా మీర్జాపురం, వుయ్యూరు జమీలను, మదరాసు రాష్ట్ర ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకోని పక్షంలో శ్రీ శ్రీ వుయ్యూరు, మీర్జాపురం జమీందార్లున్నూ, స్వాధీనం చేసుకున్న పక్షంలో గవర్నమెంటువారున్నూ, యీ ప్రాంతాలలోని పంటశిస్తు లన్నిటినీ, వారిఖర్చుపై తక్షణము బాకీచేయించ కోరుచున్నాము.

6. పై తీర్మానం ప్రకారంగా ప్రభుత్వంగాని, జమీందార్లుగాని వారి స్వాధీనంలోనుండే యీ గ్రామాలలో పొలములకు పూరాశిస్తు రిమిషను యిప్పించ కోరుచున్నాము.

7. ఈ మాసంలో వచ్చిన తుపానువలన వరదల వలన పంట పూర్తిగా నాశనమైనందువలన పశ్చిమ గోదావరిజిల్లాను తగుజిల్లాగాను, కరువు ప్రాంతంగాను ప్రకటించి, ఈ జిల్లావాసులకు కావలసిన లోటు ఆహారధాన్యములను మిగుల రాష్ట్రముల ప్రాంతములు, పై దేశములనుంచిన్నీ తెప్పించి, ముఖ్యమైన ప్రదేశాల్లో రిలీఫ్ షాపులద్వారా సప్లయి చేయించ కోరుచున్నాము.

8. కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలోని కైకలూరు, ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం తాలూకాలకు ప్రతి సంవత్సరము ముఖ్యంగా ఈ సంవత్సరము విపరీతమైన వరదలువచ్చి సుమారు లక్ష ఎకరముల సస్యము సర్వనాశనము గుచున్నది. కాబట్టి, ప్రతిసంవత్సరమున్నూ కలిగే యీ ఉపద్రవమును, ఉప్పుటేరు కొల్లేరు ప్రాజెక్టులను కట్టుటద్వారా తీర్చవలసిన అవసరం ప్రభుత్వం సత్వరించి కూడా, తెలియనంతవరకు ఆలస్యం చేయుచున్నది. పై ప్రాజెక్టులను వెంటనే కరువు నివారణ నిమిత్తం ప్రభుత్వం నిర్మించవలెను.

### గౌ॥ సి. పెరుమాళ్ళస్వామిరెడ్డిగారు

పరిశ్రమలశాఖమంత్రి సి. పెరుమాళ్ళస్వామిరెడ్డిగారు 18 వ తేదీ రైలులో ఢిల్లీ రాజ్యాంగపరిషత్తు సభకు వెడలెదరు.

# భీమవరం తాలూకాలో 2 కోట్ల రూ॥ పంట నష్టం

భీమవరం, నవంబరు 16 : పశ్చిమగోదావరి కలెక్టరు అధ్యక్షతక్రింద ఏర్పడిన భీమవరంతాలూకా సహాయసంఘం ఇటీవలి తుపాను నష్టములనుగూర్చి దర్యాప్తు చేసింది. మొత్తం 14 గురు మనుష్యులు, 1250 పశువులు మరణించుటం తెలిసింది. లక్షా 31 వేల ఎకరాల వరిపైరు నాశనమైంది. దీనికిమొత్తం 2 కోట్ల రూ॥ల దాకా వుంటుంది. 30 వేల పాకలు కూలిపోవటమో, దెబ్బతినటమో జరిగింది. తోటల్లో పండే పంట అంతా నశించింది. లోసరిగ్రామాలన్నీ కొట్టుకుపోయాయి. సీదాపురం, దుంపగడప, ధర్మపురం, కొల్లిపర్రు గ్రామాలకు కొల్లేరు వరదవచ్చి, అవన్నీ ఇంకాజలమయంగానే వున్నాయి. సివిల్ సప్లైస్ కమీషనర్ శ్రీ విజయరాఘవన్‌గారు సీడిత ప్రాంతా లన్నిటినీ పర్యటించి చూసినందున, ఎంత నష్టం వాటిల్లిందో గ్రహించే అవకాశం ఆయనకు పూర్తిగా కలగనందున వివరంగా దర్యాప్తుచేసే ప్రయత్నం చేయవలసిందని సహాయ సంఘంవారు ప్రభుత్వాన్ని శీఘ్రగ్రీవంగా కోరారు. (స్వ. వి.)

# ఆంధ్రప్రాంతంనుండి ధాన్యం రవాణా

విజయవాడ, రాజకీయ బాధితుల సంఘం కార్యదర్శి రాయని రాములుగారిట్లు వ్రాస్తున్నారు :—

ఆంధ్రంలో జరిగిన తుపాను నష్టం ఎల్లరికి తెలిసినదిదే. ఈ తరుణంలో అపరాలు విపరీతంగా యితర దేశాలకు రవాణా అయిపోతూ ధరలు విపరీతంగా పెరిగిపోతూ యున్నవి. ఇక పరుకు కూడా మిగిలేటట్లు కనబడుటలేదు. కాన యీ విషయంలో పత్రికలు గమనించినా గమనించక పోయినా గవర్నమెంటువారు అందులో ప్రత్యేకంగా ఆంధ్రమంత్రులు— ఆంధ్రశాసన సభ్యులు ప్రస్తుతం రెండు మాసముల వరకైనా ఆంధ్రమంచి యితర ప్రాంతాలకు ఆహార వస్తువులు రవాణా కాకుండా చేసి ఆంధ్రసోదరులను కాపాడ గలరు.

జాగు అయిన యెడల లాభం లేదు. గాన, వెంటనే చర్య తీసుకొనగలరని ఆశిస్తున్నాము.

# తుపాను ప్రాంతంలో రెండోపంట ఏర్పాట్లు

## వ్యవసాయశాఖ డైరెక్టరు పర్యటన

ఏలూరు, నవంబరు 16 : పశ్చిమ గోదావరిజిల్లాలో తుపానువలన నష్టపడిన ప్రాంతాల్లో పర్యటించి యిచటికి గత సాయంకాలం వచ్చిన వ్యవసాయ డైరెక్టరు ఆర్. ఎం. సుందరంగారు ఈ జిల్లాలోనూ, తూర్పుగోదావరి జిల్లాలోనూ, పంటలకు తోటలకు కల్గినవష్ట మపారమనిరి. "ఈ జిల్లాలో ఇదివరలో అధికాహారోత్పత్తి నిమిత్తం మా శాఖవారుచేసిన ప్రయత్నాలన్నీ తుపానువల్ల నిరర్థకాలైనవి. ఐనా వానిని కొనసాగింప వలసియున్నది. ఆ నిమిత్తం ముందు చేయవలసిన కార్యక్రమం విషయమై గత సాయంకాలం జరిగిన జిల్లా వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్ల సభలో ముచ్చటించితిని" అనిరి.

నరసాపురం, భీమవరం తాలూకాలలో యితర ప్రాంతాలకన్న పంటనష్టమధికము. ఈ నష్టమును రెండవపంట అధిక విస్తీర్ణములో పండించుటద్వారా కొంతవరకూ భర్తీ చేయదలచితిమి. అనేక ప్రాంతములలో విత్తనపు పంటకూడ నష్టముదొర్లినని తెలుపబడుటవలన తంజావూరునుండి తూర్పు గోదావరినుండి రెండవపంట కవసరమైన వరి విత్తనములను త్వరలో దిగుమతి చేయుచున్నాము. కొల్లేరుప్రాంతములో పంట కత్యధికముగు నష్టము వాటిల్లినది. ఈప్రాంతమునుండుఅవసరమైన ప్రత్యేక వరి రకము "నల్లార్లు" విత్తనములను రామచంద్రపురం తాలూకానుండి దిగుమతి చేయనున్నాము. సన్నకారురైతులకు విత్తనములు సుచితముగా సప్లైచేయు విషయము గూడ ప్రభుత్వంవారి ఆలోచనయందున్నది. ఎరువులుకూడ సరఫరా చేయుటకు ఏర్పాట్లు జేయబడుచున్నవి" అని ఆయన అనిరి.

# వరివిత్తనముల ధరలో పెరుగుదల

ఏలూరు తాలూకాలో రెండవపంట క్రింద పండించబడు "నల్లార్లు" వరివిత్తనముల ధర ఈమధ్య విపరీతముగా పెరిగినది. ప్రభుత్వమువారు నిర్ణయించిన ధర రు 16-4-0 యైనప్పటికీ బస్తా రు 50/- ల వరకూ చెల్లించినా విత్తనములు లభించుట లేదు. (స్వ. వి.)

# గుంటూరు మునిసిపల్ సమావేశం

## మద్రాసు గవర్నరు, న్యాయశాఖామంత్రిగార్లకు సన్మానం చేయుటానికి తీర్మానం

గుంటూరు, నవంబరు 16 : ఈనెల 12 వ తారీఖున ప్రార్థికొక వాయిదా పడిన పురపాలక సంఘసమావేశం మళ్లీ కౌన్సిలుహాలులో శ్రీ ఉప్పుటూరి వెంకటపున్నయ్యగారి అధ్యక్షతక్రింద నిన్న సాయంత్రం జరిగింది. 28 మంది సభ్యులు హాజరైనారు. ప్రప్రథమంలో కాంగ్రెసు పార్టీ సభ్యులైన శ్రీ జంగాలపల్లి లక్ష్మయ్యగారు లేచి, పోయినసారి సభలో వాయిదా ఫలానా తేదీ అని విశదపరచలేదనియు, కొత్త సభకు కనీసం 3 రోజులగడువులో నోటీసు పంపవలసిఉన్నా, ఈ సభ విషయంలో జరగవలసి పాటించబడలేదనీ, యీ సభను కొత్త సమావేశం గాకూడ పరిగణించుటకు వీల్లేదనియు, అందువల్ల చెల్లనేరదనియు, ఒక పాయింటు ఆఫ్ ఆర్డరు లేవదీశారు. దానిని అధ్యక్షుడు కొట్టివేశాడు.

తరువాత, మొన్న తుపానుదెబ్బకు పడిపెలు పాకలు పోయి మరల అదే స్థలములో అ సైజులోనే మరల యిళ్లు నిర్మించుకొనుటకు పన్ను మినహాయిస్తూ తీర్మానించారు. 22, 28 వార్డులలో ఏదైనా ఒకచోట ఒక ఆయుర్వేద ఆస్పత్రిని తెరచుటకు రు 4,500 లు మంజూరు చేశారు.

మద్రాసు గవర్నరుగారు, వారి సతీమణి డిసెంబరు 13, 14 వ తేదీలలో యీ పట్టణం వేంచేయునప్పుడు వారికి సన్మాన పత్రము సమర్పించుటకును, వారి గౌరవార్థము ఒక విందు ఏర్పాటుచేయుటకును, మద్రాసు విద్యా న్యాయశాఖల మంత్రి గౌ॥ మాధవమీనన్‌గారు యీ పట్టణం విచ్చేసే సందర్భంలో వారికి సన్మాన పత్రము నొసంగుటకు, రాష్ట్రపతి డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి పటము కౌన్సిలుహాలులో ఆవిష్కరించుటకుకూడ తీర్మానించారు.

జిల్లాబోర్డు కార్యాలయానికి ఎదురుగా నున్న కారోనేషను ఆస్పత్రి రాకపోకలకు అడ్డం వస్తున్న కారణంచేత, ఆ భవనంపడగొట్టి అచ్చట మహాత్ముని విగ్రహాన్ని స్థాపించుటకును తీర్మానించారు.

రాబోయే పురపాలక అధ్యక్షుల సమావేశానికి సూచనలను పంపే నిమిత్తం, కౌన్సిలు అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, మరి యిద్దరు సభ్యులుకల ఒక కమిటీని ఏర్పాటు చేస్తూ తీర్మానించారు. (స్వ. వి.)

# బావులకు సబ్సిడీ సౌకర్యం రద్దు

## చేగిరెడ్డి బాలిరెడ్డిగారి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 16 : ఆంధ్రరైతు కాంగ్రెసు కార్యదర్శి చేగిరెడ్డి బాలిరెడ్డిగారి క్రింది ప్రకటన చేస్తున్నారు.

"బావులకు సబ్సిడీరద్దుచేస్తూ, మద్రాసు ప్రభుత్వంచేసిన ప్రకటన, మెట్టప్రాంతీయ రైతులకు దిగ్భ్రాంతికలుగ జేసినది. మద్రాసు రాష్ట్రములో బావులు త్రవ్వించే కార్యక్రమాన్నీ, ఫలితాలను వివరిస్తూ యీ మధ్యనే ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. అందులో, అద్భుతమైన ఫలితాలు కల్పించినవనీ, ఆహారోత్పత్తి మిక్కుటంగా జరిగినదనీ చెప్పారు. ఒకవైపు ఫలితాలను పొగడుతూ, మరొకవైపు స్కీమును రద్దుచేయడం అసంబద్ధంగా ఉంది.

ఈబావులు హెచ్చుగా, మెట్టప్రాంతాలలోనే త్రవ్వించుకొనుచున్నారు. కొంత ప్రాంతాలలోనూ, ప్రాజెక్టులు, చెరువుల నిర్మాణము, సాధ్యంకానిచోట్లనూ, వర్షం లోపించే ప్రాంతాలలోనూ, యివి అమితంగా వుపయోగపడును. దేశంలో యేర్పడిన ఆహారకొరతను తీర్చుటకు, యింతకంటే మారుమార్గములేదనియే, ప్రకాశం మంత్రివర్గము యీస్కీమును ప్రవేశపెట్టారు. తాత్కాలిక వుపయోగానికే కాకుండా, శాశ్వత క్షామనివారణకిది కొంతవరకుసాధనమనీ, రైతు కాంగ్రెసు దీన్నే పర్యాయములు సూచించినది: ప్రాజెక్టులు, చెరువుల నిర్మాణమునకు కోట్లకొలది వెచ్చించే యీ దినాలలో, మెట్టరైతులకు కల్పించిన, యీకొద్దిసదుపాయాన్ని రద్దుచేయడం, అన్యాయం. ఈపరిస్థితులన్నీ చూస్తే, కాంగ్రెసు ప్రభుత్వాలలో, పట్టణవాసులకూ, పారిశ్రామిక వర్గాలకూ, వ్యాపారులకూ పలుకుబడి హెచ్చుతున్నట్లు స్పష్టమగుచున్నది. గ్రామీణుల ఆర్థికసౌష్టవత, రైతుపురోభివృద్ధి ప్రభుత్వ దృష్టిలో అగ్రస్థానము వహించనంతవరకూ, అధికాహారోత్పత్తి మిథ్యగానే పరిణమించగలదు.

మద్రాసుప్రభుత్వం, తమచర్యను పునరాలోచించి, బావుల సబ్సిడీ కార్యక్రమాన్ని సాగించడం వుచితంకాగలదు.


## నోటీసు

నంద్యాల డి॥ ము॥ కోర్టులో
అ. నెం. 299/49. I. A. 874/49 (a)
వాదులు : ముల్లా అబ్దుల్లాసాహెబ్ వగైరా.
ప్రతివాదులు : బయ్యగారి అలీసాహెబ్ వగైరా.

నంద్యాల తాలూకా బండ్యాత్మకూరుగ్రామంలో వుండే మసీదు యినాములను గురించి సదరు మసీదుయందు అభిమానముగల యావత్తు మహమ్మదీయుల తరఫున Representative Suit దాఖలుచేసికొనుటకు కోర్టువారికి సి. పి. సి. ఆ 1రూ 8 క్రింద పర్మిషను కోరి అర్జీ యిచ్చుకొని వున్నారు. అందునుగాను, మహమ్మదీయులకెవ్వరికేగాని ఆక్షేపణ యున్న యెడల 21-11-49 తేదీన కోర్టుకు హాజరై తెల్పుకోవలయును. లేనంతట కోర్టువారు యెక్స్‌పార్టీగా తీర్మానించుదురని తెలుపడమైనది.

యన్. నరసింహాచార్లు,
వాదుల వకీలు.



## టెండరు నోటీసు

ఏలూరు కో-ఆపరేటివు హౌస్ బిల్డింగు సొసయిటీ లిమిటెడ్,
W. G. 457.

ఈ సొసయిటీవారిచే నిర్మింపబడుచున్న నాగభూషణచౌదరి నగరములో రోడ్లు వేయుటకు సీల్డు టెండర్లు ఈ దిగువ సంతకముచేసినవారిచే ది 5-12-1949 తేదీ సాయంత్రము గం. 5 లోగా తీసికొనబడును. దరఖాస్తు చేయగోరువారు అయిదు రూపాయలు ధరావతు కట్టి ది 20-11-1949 నుండి 5-12-1949 తేదీలలో ఉదయము గం. 11 ల నుండి సాయంత్రము గం. 5 ల వరకు టెండరుఫారములు, ఎస్టిమేట్లు మొదలగునవి సొసైటీ ఆఫీసులో తీసికొనవచ్చును. ఆమోదింపబడిన టెండరువారు రు. 1000 లు ధరావతు కట్టి వెంటనే పని ప్రారంభించవలసి యుండును.

కలగర నాగభూషణచౌదరీ,
బి. ఏ., బి. యల్., ప్రసిడెంటు.
ఏలూరు, 15-11-1949.



# కంజీవరం ఫండ్సు లిమిటెడ్.,

హెడ్డాఫీసు: కాంచీపురం.
బ్రాంచి : 25, తంబుచెట్టివీధి, మద్రాసు 1.

మా అపూర్వమైన స్కీము ద్వారా
మీ భవిష్యతుకు నిలవచేసుకోండి

ఈ రోజున మీరు మావద్ద పెట్టుబడి పెట్టే ప్రతి రు 778/- లకు
నలభై నెలల తరువాత మీకు రు 1000/- లు చేరుతుంది

ప్రమాదం లేదు : నష్టం లేదు : సందేహం లేదు

వివరములకు : కే. ఆర్. చారి, సెక్రటరి.



## బంగారం ఉచితం

మినర్వా గోల్డు ప్రజలలో వ్యాప్తిగావించుటకు, రెండు జతల గాజులు, (డైమండ్ కట్) ఒక మెడగొలుసు, ఒక జత చెవుల పోగులు, రెండు వుంగరాలు (బొంబాయి ఫ్యాషన్) గల ఒక శాంపిల్ బాక్సు తయారుచేసి, మూడు తులాల మినర్వా గోల్డుతో ఉచితముగా యిస్తున్నాము. ఫ్రీగోల్డుకు, శాంపిల్ దాక్సుకు నేడే వ్రాయండి. ఇటువంటి అవకాశం తిరిగి దొరకక పోవచ్చును.

GENERAL SUPPLY CO., P. B. 76 (A.P.)
AMRITSAR.



# సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్.

"ఇండియాలో గొప్ప భారతీయ జాయింట్ స్టాకు బ్యాంకు." (స్థాపితము 1911 డిసంబరు)

| | | | |
|---|---|---|---|
| అనుమతిపొందిన మూలధనము | రు 6.30.00.000 | చెల్లించిన మూలధనము | రు 3.14.54.250 |
| జారీచేసిన మూలధనము ... | రు 5.77.50.000 | రిజర్వు తదితర నిలవలు | రు 4.04.38.500 |
| చందావేసిన మూలధనము .... | రు 5.76.66.125 | 30-6-49 నాటికి డిపాజిట్లు | 1.26 94.96.900 |

హెడ్ ఆఫీసు : మహాత్మాగాంధి రోడ్డు, ఫోర్టు, బొంబాయి.

ఇండియాలోను, పాకిస్తాన్‌లోను, బర్మాలోను, బ్రాంచీలు, పే ఆఫీసులు ఉన్నవి.

మేనేజింగు డైరెక్టరు : శ్రీ హెచ్. సి. కెప్టెన్, జె. పి.

లండన్ ఏజెంట్లు:— మెసర్సు బార్‌క్లేస్ బ్యాంకు లిమిటెడ్, మిడ్లాండు బ్యాంకు లిమిటెడ్. న్యూయార్కు ఏజెంట్లు :—ది గ్యారంటీ ట్రస్టుకో ఆఫ్ న్యూయార్కు, మరియు ది నేషనల్ సిటీ బ్యాంకు ఆఫ్ ది సిటీ ఆఫ్ న్యూయార్కు. అన్నిరకముల బ్యాంకింగు వ్యాపారం నిర్వహించబడును. వివరములు దరఖాస్తుమీద తెలిసికొనవచ్చును దక్షిణ ఇండియాలో బ్రాంచీలు :—

అదోని, అలెప్పీ, అల్వాయి, బంటానమ్ముద్రం, బెంగుళూరు, బళ్లారి, విజయవాడ భీమవరం, కాలికట్, కన్ననూరు చిదంబరం, చైనాబజారు (మద్రాసు), కాకినాడ, కొచ్చిన్, కోయంబత్తూరు, కూనూరు, కడప, దారాపురం, డోన్ (ద్రోణాచలం), దిండిగల్, ఏలూరు, ఎర్నాకులం, ఈరోడ్, గుంటకల్, గుంటూరు, కరూర్, కొట్టాయం, కారైక్కుడి, కోవిల్‌పట్టి, కుంభకోణం, కర్నూలు, మద్రాసు, మదురై, మంగళూరు, మౌంట్‌రోడ్ (మద్రాసు), నంద్యాల, పొళ్లాచ్చి, పన్‌రుటి, క్విలన్, రాజమండ్రి, రాజపాళయం (రామనాడ్ జిల్లా), సేలం, సాత్తూరు, తాడేపల్లిగూడెం, తాడిపత్రి, తంజావూరు, తేని, తిరునల్వేలి టౌను, తిరునల్వేలి జంక్షను, తిరుప్పూర్, తిరువారూర్, తిరుచిరాపల్లి, తిరువేంద్రం, త్రిచూర్, ట్యుటికొరిన్, ఉడుమలపేట, వెల్లూరు, విరుధునగర్,

బ్యాంకుయొక్క సబ్సిడియరీ కంపెని ఎగ్జిక్యూటరీ మరియు ట్రస్టీవ్యాపారమును చేయును.



| | | |
|---|---|---|
| అంతా సరిగా జవాబు పంపు ప్రతి పోటీదారుకు మొదటి బహుమతితోపాటు రు.100/- అదనముగా యివ్వబడును. | గవర్నమెంటు రిజిస్టర్డు 2007. అంతా సరైన జవాబుకు రు 4000/- మొదటి మూడు నెంబర్లు సరిగా వుంటే రు 2,000/- ఎక్కువ ఎంట్రీలకు రు. 1000/- | ముగింపు తేదీ: 3-12-1949 ఫలితములు : 15-12-1949 |

# రు 7,000 గ్యారంటీ

30

ఈ అయిదు గదులలో 4 మొదలు 8 వరకు అంకెలు వాడి, మొత్తము 30 వచ్చునట్లు చేయవలెను. కరెక్టు సొల్యూషను మద్రాసు, ప్రీమియర్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌లో డిపాజిటుచేయబడినది.

ప్రవేశరుసుము: సింగిల్ ఎంట్రీ 0-8-0. 12 ఎంట్రీలకు. 5/-

రూల్సు : సాదా కాగితంమీద ఎన్ని ఎంట్రీలైనను పంపవచ్చును. మీ పేరు, అడ్రెసు విడి అక్షరములలో ఇంగ్లీషులో వ్రాయవలెను. ఎం. ఓ., రశీదులు, ఐ. పి. ఓ. లు ఎంట్రీలతో పంపవలెను. అన్నివిషయములలో మేనేజరుతీర్పు ఖాయము, న్యాయబద్ధమైనది, కాంపిటీషన్ గురించి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు. ఫలితములకు 4 అణాలు పంపుడు.

కాంపిటీషన్ నెం. 22

స్పోర్ట్సు ఫూల్సు (ఎ. పి)
11, మెక్‌లీన్ స్ట్రీట్, మదరాసు 1.



స్థాపితం 1871

మంచి సదుపాయములు సాటిలేనిసేవ

ది బాంబే మ్యూచువల్ లైఫ్ ఎస్యూరెన్సు సొసైటీ లిమిటెడ్

బొంబాయి మ్యూచువల్ బిల్డింగు,
హార్న్‌బీ రోడ్డు, బొంబాయి

ప్రతిపాలిసీదారూ ఒకవాటాదారు